22301

# డిపీస్ నుండి మరొక వినియోగదారుని- లాభదాయక పథకం

## రూ.1·10లు తగ్గింపు

## డిపీస్ జెల్లీ క్రిస్టల్స్‌పై

మీ విక్రేతల వద్ద లభ్యమైన డిపీస్ పదార్థాలన్ని గమనించండి. డిపీస్ యొక్క స్క్వాష్/సిరప్/క్రష్/కార్డియల్ ప్రతి సీసా ఒక కూపన్ కలిగియుంటుంది. అది మీరు కొనే ప్రతి ప్యాకెట్ డిపీస్ జెల్లీ క్రిస్టల్స్ యొక్క ముద్రింపబడ్డ ధరపై రూ. 1.10లు తక్కువ కల్గియుంటుంది. కాబట్టి ఒక సీసా కొనండి. అందులో వున్న కూపన్ వేరుచేసి, అది మీ విక్రేతకిచ్చి ఆరు రకాల పండ్ల సువాసనగల డిపీస్ జెల్లీ క్రిస్టల్స్‌లో దేనినైనా తీసుకోండి.

చెర్రీ, ఆరెంజ్, రాస్ప్బెర్రీ, లెమన్, స్ట్రాబెర్రీ మరియు పైనాపిల్

**నేడే కొనండి...లాభాన్ని పొందండి.**

**ఈ ఆకర్షణీయమైన సదుపాయం కేవలం 30.6.1976వ తా॥ వరకే.**

కేరళ రాష్ట్రము మినహా, భారతదేశమంతా ఈ సదుపాయం గలదు




Dipy's COUPON
RS. 1.10 OFF
on Dipy's Jelly Crystals
VALID TILL JUNE 30, 1976

Dipy's
ORANGE SQUASH

Dipy's
RASPBERRY JELLY CRYSTALS
MADE IN INDIA BY
HERBERTSONS LIMITED
Homi Mody Street, Bombay 400 001

Interpub/HL 1/76 (e)





## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 2–4–'76

నలనామ సం. చైత్ర శు విదియ

***సంపుటము : 69 సంచిక : 30***

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు. 33–80
ఆరుమాసాల చందా – రు. 16–90
విడి ప్రతి వెల 60 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
మన్మథోత్సాహం
(చిత్రకారుడు : శ్రీ బాపూరి కృష్ణమూర్తి)

# మనలో మాట

*మా పాఠకులకు, కార్టూనిస్టులకు ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు అందరికీ మా ఉగాది శుభాకాంక్షలు !*



ఎస్. ఎస్. లాల్

ఈ వారం సినిమా బ్యాలట్ ఫలితాలు, దీపావళి [illegible] సీరియల్ కథల బ్యాలట్ ఫలితాలుకూడా లెక్కింపు పూర్తి కానందువల్ల అంద మేము చిన్న సీరియల్ కథలను ప్రచురించిన వరు కథకులు నలుగుర్ని యిక్కడ పరిచయం చేస్తున్నాము తరువాత వీరికి అదనపు బహుమతులను అంద

మైనస్ బ్రతుకులు రచయిత శ్రీ యస్. అందరికి ఒక ఉత్తమ ఛాయాగ్రాహకులుగా పరిచితులే. హృదయాలు, నిండు మనసులు, నిప్పులాంటి మనిషి గ్రహణం ఆయన నిర్వహించారు. స్వగ్రామం పెద గుంటూరులోను విద్యాభ్యాసం, "కలంతో కథల కామెరాలో కథలు చెప్పాల్సొచ్చింది" అంటున్నారాయన.



ఉమాదేవి

జేయలేకపోతున్నాము. అయితే కలో దీపావళి పోటీలో ఎన్నికైన బ్యాలట్ ఫలితాలు వెల్లడిచేసిన జేస్తాము.

యస్. లాల్ చలనచిత్రాభిమాను మొనగాళ్లకు మొనగాడు, నిండు లాంటి చాలా చిత్రాలకు ఛాయా ఓగిరాల. నూజివీడులోను, చెప్పాలని. మద్రాస్ వచ్చాను. మా పాఠకులకు వారు యిదివరకె రచయితగా పరిచితులు. వారు వ్యంగ్య చిత్రకారులు కూడా !

"రాదారిపడవ" రాసిన రచయిత్రి శ్రీమతి ఉమాదేవిగారు వారి జీవిత విశేషాలను "ఇక నా జీవిత విశేషా లంటారా? చెప్పుకోటానికి పెద్దగా ఏమీ లేవు" అంటూ క్లుప్తంగా తెలిపారు "చదువు చాలా కొంచెం, ప్రేమ వివాహం ప్రస్తుత నివాసం వరంగల్" ఈ రాదారిపడవయే వారి మొదటి రచన "జీవితంలో పెద్దగా ఆశలూ, ఆశయాలు ఏమీ లేవు మంచి రచయిత్రిననిపించుకోవాలన్నది తప్ప" అంటున్నారామె



కవన శర్మ

పరిధి రచయిత మా పాఠకులకు బాగా పరిచితులు కవనశర్మగారు వీరు యిది వరకు కూడా ఎన్నో బహుమతులు పొందినవారే. బెంగుళూరులో ఇండియన్ యిన్స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు విశాఖలో బి. ఇ. డిగ్రి, ఖరగ్‌పూర్‌లో ఎమ్. టెక్ చదువు కొని బెంగుళూరులో ఎ హెచ్ డి పుచ్చుకున్నారు. చిన్నప్పట్నుంచి రచనా వ్యాసంగం హాబీ. వ్యంగ్య రచనలో ప్రత్యేకత సంతరించుకున్న యీ రచయిత ఒక నవల, కొన్ని శాస్త్రీయ గ్రంథాలు కూడా రాశారు వీరికి ఇద్దరాడపిల్లలు.



శ్రీ సింధు

మిణుగురులు రచయిత 'శ్రీ సింధు' అనే కలం పేరుతో పాఠకులకు పరిచితులే అయిన అంపేరాయని చంద్రశేఖరరావు గారు హైదరాబాదులో వుంటున్నారు స్వగ్రామం పటమట [ విజయవాడ ] వయసు నాలుగు పదులు దాటింది. బి. కామ్. పట్ట భద్రులు ముగ్గురు సంతానం డిఫెన్స్ అకవుంట్స్ డిపార్టుమెంట్‌లో వుద్యోగం 1955 నుంచి కథలు 'అంపేరాయని' శ్రీ సింధు అనె పేర్లతో రాస్తున్నారు వీరి మొదటి కథ 'కదిలించిన దృశ్యం' ఆంధ్రపత్రికలో పడ్డదే.

ఈ రచయితలు నలుగురికి సంపాదకుని ఎన్నికలో విజేతలై సచిత్ర వారపత్రిక పాఠకుల విశేషాదరణ చూరగొన్నందుకు మా శుభాభినందనలు. బ్యాలట్ ఫలితాలకు ఎదురు చూసె పాఠకులతోపాటే వారున్నూ అనే ఫలితాల కోసం ఉత్తమ వ్యాసాల కోసం పై వారం దాకా ఎదురుచూస్తారని ఆశిస్తున్నాం

## ఉత్తరాలు

ధర్మపథం

20-2-76 సంచికలో ధర్మపథం శీర్షి కను శ్రీ [illegible] వెంకటరమణయ్యగారు రాసిన నమ్మకం లేకపోతే కథ చదివిన తరువాత నాకు ఎప్పుడో హరికథలో విన్న నా పిట్టకథ స్ఫురించింది నమ్మకానికి సంబంధించినదే కావున అది మీకు రాసి పంపుతున్నాను ఒక నదీ తీరంలో ఒక సాధువు ఆశ్రయం ఏర్పరుచుకొని జపం చేస్తూండేవాడు నదికి అవతలి గట్టున నో చిన్న గ్రామం వుండేది ఆ గ్రామంనుంచి రోజూ ఒక యాదవస్త్రీ సాధువుకు పూజకు పాలు తెచ్చిఇచ్చేది ఎప్పుడో ఎక్కువగా వర్షం పడ్డప్పుడు తప్ప ఆ యువతి నదిని అనాయాసంగా దాటి రాగలిగేది

ఇలా వుండగా నొక రోజున వర్షాలు విపరీతంగా పడడంవల్ల నదికి వరదలు పొంగి నది ఆ పడుచు నది దాటలేని పరిస్థితి ఏర్పడింది నొక రెండు గంటలు తరువాత వీరు ఆగ్ని పిమ్మట పాలు తెచ్చి యిచ్చింది. పూజకు పాలు రానందున సాధువు చాలాసేపు ఆతృతతో ఎదురు చూస్తున్నారు. ఆలస్యానికి కారణం అడిగారు. ఆమె చెప్పిన సమా ధానం విని విశాలాత్రం భక్తిలేనందువల్ల నది దాటలేకపోయినావు. దేవునిమీద భక్తి వుంటే యిలా వరదలు నిన్నేమి చేయగలవు అని [illegible] బోధించి ప్రసంగం చేశారు. అది విన్న యువతి పవిత్ర మనస్సుకు బాధపడుతూ ఇంటికి వెళ్లింది. ఆ రాత్రి కూడా వర్షాలు ఇంకా ఎక్కువగా పడ్డాయి. తెల్లవారేసరికి స్వామీజీ ఆశ్రమం [illegible]

(46వ పేజీ చూడండి)


ఇదే! మా వారు ఉగాది పండుగకు కొని తెచ్చిన చీర!!


బావర్సురావు ఎందుకలా పారి పోతున్నాడు చెప్మా?!
ఇడ్లీల మీద ఉగాది పచ్చడి ఎక్కువగా వేశా!!
శ్రీనివాస్


ఫ్రెండ్స్! నేను ఉగాది నాడు పుట్టాను! అందుకని నా....!!! బర్త్ డే పార్టీ మీకిలా...
ఉగాది పచ్చడి


ఎవరండీ ఆ పార్టీ? ఓ ప్రెజెంటేషనూ పాడూ ఏమీ లేదు! చేంతో వేప పువ్వు ఇచ్చిపోతున్నాడు!
గట్టిగా అరవకౌ బాబూ! ఇది ఎమర్జెన్సీ ఉగాది!!


బారెడు పొద్దెక్కినా ఉగాది పూటా
అలారం పెట్టినా == అరచి గీ
అంట్లో పెట్టినా
పడుకునే దేటి ఇవ్వాళ మాత్రం
ఎంగారూ? లేచి పోశారుగా దాయన!!(?)
శ్రీనివాస్


ఉప్మా చేదు విషం! సాంబార్ చేదు కషాయం!! ఏమిటీ ఘోరం! మా యింట్లో సుగో?
ఉగాది స్పెషల్ బావగారూ! కరివేపాకుకి బదులు...!!!

# కొత్త సంవత్సరం

ఫాల్గుణ బహుళ అమావాస్యలో పాత సంవత్సరం ముగిసి కొత్త సంవత్సరం చైత్ర శుద్ధ పాడ్యమిలో ప్రారంభ మవుతున్నది

రాక్షస సంవత్సరం పోయి 'నల' సంవత్సరం వచ్చినదన్నమాట!

అనంతమైన ఈ కాలానికి ఎక్కడో ఒక చోట ప్రారంభం ఉండాలి గదా! అందుకోసమే చైత్ర శుద్ధ పాడ్యమి కాలానికి ప్రారంభమని నిర్ణయించబడింది. కొందరు కృతాది యుగాలకు వేర్వేరు రీతుల ప్రారంభాన్ని చెప్పిన వాడుకలో కలియుగ ప్రారంభం చైత్రమాసంతోనే మొదలవుతూ ఉన్నది

బ్రహ్మ సృష్టితోనే యుగం ప్రారంభమై అదే యుగాదిగ ప్రసిద్ధమయింది యుగాది ఉగాదిగా వాడుకలోకి వచ్చింది. ఆ ఉగాదే సంవత్సరాది అయింది

భాస్కరాచార్యులవారి సిద్ధాంత శిరోమణిలో

> లంకా నగర్యా ముదయాచ్చ భానో:
> తస్యైవ వారె ప్రథమం బభూవ,
> మధో: సితాదే ర్దిన మాస వర్షం
> యుగాదికానాం యుగపత్ ప్రవృత్తి

అని చెప్పిన దానినిబట్టి చూస్తే లంకానగరంలో దృశ్యమానమయిన సూర్యోదయాన్ననుసరించి కాలమానం ప్రారంభించబడినట్లు తెలుస్తున్నది. లంకా నగరంలో మధు మాసం యొక్క అంటే చైత్ర మాసం యొక్క శుక్లపక్షపు తొలిదినం భానువారం మొదలుకొని కాలపరిగణన ప్రారంభ మవుతున్నది అది మొదలు దిన, మాస, సంవత్సర యుగాల లెక్క నిర్ణయించబడుతున్నదని దీని అభిప్రాయం. దక్షిణ భారత దేశంలో సౌరమానం ప్రచారం ఉన్నా, కాలమానం మాత్రం చాంద్రమానమును అనుసరించే జరుగుతున్నది.

మనం తలచుకొన్న పని దిన ప్రారంభంలో సానుకూలమయితే ఆ రోజు అన్ని పనులూ అనుకున్న రీతిగా సక్రమంగానూ, అనుకూలంగానూ జరిగిపోతాయి. ఇది అనుభవజ్ఞులైన చాలా మంది అభిప్రాయం. ఆ రీతినే ఈ సంవత్సరాది నాడు సంతోషంగా ఉంటే ఏడు పూర్తిగా సంతోషంగా సాగిపోతుందనీ ఈ దినం విచారంగా ఉంటే సంవత్సరం పూర్తిగా ఏదో విచారం కలుగుతూనే ఉంటుందనీ మనవాళ్ల నమ్మకం. అందుకనే ఈ రోజు సంతోషంగా గడపడానికే ప్రయత్నిస్తారు. కలహాలు తగవులూ ఏర్పడే అవకాశాలున్నా వాటిలో జోక్యం కలుగజేసుకోకుండా ఉండడానికే ప్రయత్నిస్తారు. నూతన వస్త్ర ధారణ, బంధుమిత్రులతో కలిసి విందు భోజనలు చేసి వినోదంగా కాలం గడపడం జరుగుతుంది.

కడచినది రాక్షస సంవత్సరం. రాక్షసుడు వీర విహారం చేసి దేశాన్ని చాలా బీభత్స పరచాడు. బీహారు మున్నగు ప్రాంతాలలో అతివృష్టివల్లా, దక్షిణప్రాంతంలో అనావృష్టివల్ల జనం చాలా క్షోభపడిపోయింది బియ్యం, నూనెలు, మిరపకాయలు మొదలైన దైనందిన అవసర వస్తువుల వెలలు మిన్ను ముట్టి, ఆ పదార్థాలు సామాన్య జనుని అందుబాటుకు దూరం అయి పోయాయి నల్ల బజారు వ్యాపారం దొంగరవాణా పద్ధతి మితిమీరి పోయింది. ఆ సంవత్సరం చాలా భాగం గడిచిన తర్వాత కేంద్రప్రభుత్వం అవలంబించిన పద్ధతుల ద్వారా పరిస్థితులు కొంత అదుపులోనికి వచ్చి ప్రజలు కొంచెం ఊపిరి తీసుకోడానికి వీలు ఏర్పడింది. అయినా జనులు సుఖంగా కాకపోయినా సాధారణంగానైనా కాలం గడపడానికి ఇంకా కొంత కాలం పట్టవచ్చు రాక్షస సంవత్సర ప్రారంభం తగ్గిపోయి నలనామ సంవత్సర ప్రవేశంతో జనుల సుఖజీవన శాంకురాలు బాగా మొలకెత్తి ఆమని శోభకు దోహదం చెయ్యగలవని నమ్మవచ్చును. 'నల' అనేది సంవత్సర నామము మాత్రమే కాదు. నిషధ దేశాధిపతి పేరుకూడాను. 'నలస్య... చ, కీర్తనం కలినాశనం' అనే ప్రాచీనాభిప్రాయం ప్రకారం 'నల' అంటేనే కలిదోషాలు పోతాయి కనుక ఈ 'నల సంవత్సరం' నలచక్రవర్తి నామ సామ్యం బట్టి ఇంకా దేశంలో వున్న అక్రమాలు అన్యాయాలు తొలగిపోయి ప్రజలు సుఖిస్తారని ఆశించవచ్చును.

వసంత నవరాత్రాలు కూడా ఈ సంవత్సరాది తోనే ప్రారంభమవుతాయి. ఈ నాడు జరుపవలసిన కార్యక్రమాలను గురించి, ధర్మసింధువనే ధర్మశాస్త్ర గ్రంథంలో చెప్పిన దిది

> "తైలాభ్యంగం సంకల్పాదౌ నూతనవత్సర
> కీర్తనాద్యారంభం... ప్రతిగృహంధ్వజారో
> హణం నింబపత్రాశనం, వత్సరాదిఫలశ్ర
> వణం, నవరాత్రారంభః . . .

దీనినిబట్టి నాడు అందరూ ప్రాతఃకాలంలోనే తైలాభ్యంగస్నానం చెయ్యాలి. సంకల్పానికి ముందు నూతన వత్సర వైశిష్ట్యాన్ని కొనియాడాలి. ఇంటింటా ఆనంద సూచకంగా ధ్వజారోహణం జరగాలి మనం స్వాతంత్ర్య దిన సూచకంగా త్రివర్ణ పతాకలను ఇప్పుడు నిలుపుతున్నట్లు అప్పుడు అంటే పూర్వం ధ్వజాలు నిలపడం ఉండేదన్నమాట. ఆ ఆచారం ఇప్పుడు నామ మాత్రావశిష్టమై ఉన్నది. పంచాంగశ్రవణం ఇప్పుడూ ఉన్నదే! అందరూ కూడా ఆ సంవత్సరం తమ జీవితం ఎలా జరుగుతుందో! ఫలాఫలాలను తెలుసుకోడానికి కుతూహల పడడం సహజమే. ముఖ్యంగా రాజ పూజ్యావమానాలను ఆదాయ వ్యయాలను, కందాయాలను నక్షత్ర ఫలాలను పిల్లలు కూడా తెలుసుకొనాలని అభిలాషపడతారు. తమకు తమ నక్షత్రాలు తెలియక పోయినా తమ పేరునుబట్టి నిర్ణయించే నక్షత్రాల ను తెలుసుకుని తృప్తిపడతారు.

ఇక ఉగాది పచ్చడిని గురించి ఇది ఎప్పటినుంచీ అమలులోనికి వచ్చిందో తెలియదు గాని ప్రాచీన సంప్రదాయంలో కానవనందున నవీనమైన పద్ధతే అని చెప్పవలసి ఉన్నది. శాస్త్రప్రకారం వేపచిగుళ్ళను, భక్షించే ఆచారమే కానవస్తుంది. వేపచిగుళ్ల భక్షణమే వేప పూవుల భక్షణమై, దానికి తగిన అంగాలను కూర్చుకుని కమ్మని పచ్చడిగా తయారయింది. పూర్వం అప్రధానంగా ఉండిన భక్షణ రాను రాను ప్రాధాన్యానికి వచ్చింది. ఉగాది పచ్చడి లేకపోతే సంవత్సరాది పండుగే లేదనే గట్టి అభిప్రాయం ఏర్పడిపోయింది.

ఈ సంవత్సరం సర్వంగా సానుకూలంగా సాగిపోగలదని, అలా సాగిపోడానికి సర్వజనులూ శాయశక్తుల పాటుపడాలని కోరిక

"అంగీరస."

# ఆమని పాట

— డాక్టర్ దాశరథి

మామిడికొమ్మ వీణగా
మనోహరగీతం ఆలపిస్తూ
మనని మేల్కొల్పుతున్న ఆమని
మానవతా నవరత్నాలగని

ఈ గనిలోనుంచి వెలువడిన
అమూల్య మాణిక్యరాశులు
సామాన్య విపణిలో దొరకవు
ధనం ఎంతపోసినా లొంగవు

ఈ రత్నాలను, మాణిక్యాలను
ఇంటికి తెచ్చుకోవాలనుకున్నవారు
జాతికోసం, దేశంకోసం
చేతనైనన్ని త్యాగాలు చేయాలి

ఇంటిలోపలా, ఇంటి వెలుపలా
కొంటెకోణంగులు కుట్రపన్నుతున్నారు;
'ఆ సేతుహిమాచల పర్యంతం ఐక్యం'
అన్నమాటను అబద్ధం చేయాలని
చూస్తున్నారు

మనజాతి పతాకం తలవంచదని
వనంలోని ఆమ్రశాఖాగ్రం చెబుతున్నది
మన ఐకమత్యం ఏనాటికీ చెడదని
మల్లి, మాలతీ, మంజరి అంటున్నది

విరబూసిన సుందరోద్యానంలా
భరతభూమి కళకళ లాడాలి
ఈనాడు వచ్చిన పచ్చని వసంతం
ఇలాగే కలకాలం ఉండిపోవాలి.

# హైదరాబాద్ నోట్ బుక్

భుజంగరాయుని చండాలిక,
వెంపటి చినసత్యం శోభ

చండాల కన్య ప్రకృతి ప్రకృతిలాగే సహజ సరళ సుందరంగా పెరిగింది. సంఘంలోని తారతమ్యా లేమీ ఎరుగనిది. పూవులు అమ్ముతున్నారు. పుష్ప లావికలు.

వాటిని కొనబోతుంది భగవత్పూజకోసం "ఆమె చండాలిని, అంటరానిది, అమ్మకండి" అని అనుశాసనికలు వారిస్తారు. ఇలాగే పాలు పెరుగు అమ్మే గొల్లభామలు వస్తారు. గాజులమ్మేవారు వస్తారు. కాని అనుశాసనికలు ఎప్పటికప్పుడుఆమెను అవమానిస్తారు. చండాలిక మనస్సు మరిగిపోతుంది. తాను నమ్మిన భగవంతుని ప్రశ్నిస్తుంది.

కాని భగవంతునికి చెవులు. ఈమె మొర వినడానికే ఉన్నాడా? చండాలినికి కోపం వస్తుంది.

కనలు ఎదుట నిలువకు పోపో?
మనసులోన మసలకు పోపో!

అని ఆక్రోశిస్తుంది. రోదిస్తుంది. అప్పుడు పిపాసి వీడి ... ఆనందుడు తథాగతునిసోదరుడు ఆ దారిని ... దప్పి తీర్చమంటాడు. "నేను చండాలిని. నా చేతి నీరు వద్దు" అంటుంది చండాలి.

"నా స్నేహ, మానవ సోదరీ,
పా..., వనితా సహోదరీ
నీలో నాలో, ఎల్లరిలో

ప్రవహించు నొకే చైతన్య ధార
ఉదయోదిత హిమ ముక్తామల
సురశ్రైవలినీ జల నిర్మల,
నీ పావన కరముల పిపాస తీర్చు
భగవతీ. . . . "

అని ప్రబోధిస్తాడు. ఆమె అతని దప్పిక తీరుస్తుంది. ఆనందుడు వెళ్ళి పోతాడు. చండాలికకు ఇదంతా ఒక కలగా తోస్తుంది.

దిగ్భ్రాంతురాలవుతుంది. ఆశారేఖ పాట పాడుతుంది.

"ఈ తమోవల్లరి ఉషస్సులకు పూయదు
ఈ శిథిల వేణు గళమ్ములకు మ్రోయవు
ఈ నైచకూపమున పంకజము మొలుచదు
ఈ ఘోర శావమున కంత మోలు కలుగదు"

అనుకున్న నిరాశ విడిపోయే సూచన కనిపించింది. కాని, నిరంతరం ఆనందుని ధ్యానమే అయింది. తల్లి మాయ ఇది చూచి,

"ఎగిరే ఆశల రెక్కలు
తెగటార్చిన మిలుకు తెవరు?
కలిందము పాపుల
కాటందిన కోరలెవరు?"

అని ప్రశ్నించి ఎవడు వాడు, వానిని తనమాయతో తెస్తానని కుమార్తెను ఓదించగా, చండాలిక ఒకనాడు భిక్షుకులతోపాటు వెళ్తున్న ఆనందుని గుర్తించి,

తల్లికి చూపుతుంది. తల్లి ఆమెకొక అద్దమిచ్చి, ఆనందుడు ఆకృష్టుడు కావడానికి అభిచారపు నృత్యం చేస్తుంది ఆనందుడు ఆ అద్దంలో చిక్కి శల్యమై పోయిన రూపంలో కనిపించి, మాయా బలంతో నిజంగాను శల్యమయ్యే చండాలిక వద్దకు వస్తాడు. చండాలిక పశ్చాత్తాప పడుతుంది. ఆనందుడు

ద్విజత్వం ప్రసాదిస్తాడు ఇది మార్చి 5 వ తేదీన రవీంద్రభారతిలో శ్రీ వెంపటి చిన సత్యం కూచిపూడి ఆర్ట్ అకాడెమీ చండాలిక నృత్య నాటిక రూపంలో ప్రేక్షకులకు అందిపెట్టిన అమృతం.

రవీంద్రుని వంగనాటికలోని వస్తువును గ్రహించి కావలి జవాహర్ భారతి ఆచార్యులు, మిత్రులు శ్రీ భుజంగరాయశర్మ నృత్య నాటికగా, కవితామయమైన నాటికగా రచించారు. సుప్రసిద్ధ నాట్యాచార్యుడు శ్రీ వెంపటి చినసత్యం నృత్యాలు కూర్చారు. ఆకాశ

(42 వ పేజీ చూడండి)

# వారఫలం

మహేష్

**2-4-1976 శుక్రవారం మొదలు**
**8-4-1976 గురువారం వరకు**

మేషం :— ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

వృషభం :— సాహసిక వ్యవహారల్లో నష్టం రాగలదు. వృత్తిలో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంల నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

మిధునం :— వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

కర్కాటకం :— అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలో శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

సింహం :— వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కన్య :— శ్రమకు గురికాగలరు మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

తుల :— వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు సాటివారిచే గౌరవం లభిస్తుంది.

వృశ్చికం :— రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. వారం ఆఖరులో ప్రయాసకు గురికాగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

ధనుస్సు :— సాహసిక వ్యవహారలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

మకరం :— మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి.

స్త్రీలకు — బంధుమిత్రులను కలుసుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కుంభం :— వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ఆర్థిక వ్యవహారల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు - ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

మీనం :— ఆర్థిక వ్యవహారలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వ్యాపారంలో సాటివారిపోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లభిస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు — నూతన విషయాలు తెలుసుకొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి

## గమనిక

"మినీ యింటర్వ్యూలు" అనేవి టపాలో వస్తే వాటిని స్వీకరించి వేయడం సాధ్యం కాదని మా యువ పాఠకులకు మనవి ... సం.



# మండుటెండ - మంచి గంధం

యార్లగడ్డ రుక్మా బుచ్చేశ్వరి

ప్రమోద వళ్ళు జ్వరంతో పేలిపోతున్నది. కళ్ళు తెరచి చూడాలని వుందిగాని కను రెప్పలు బరువుగా వాలిపోతున్నాయి.

మూడురోజులనాడే భర్త స్వగ్రామం వెళ్ళాడు ధాన్యం వసూలు చేయించడానికి. ప్రమోదకి భర్త వెళ్ళిన సాయంత్రమే విపరీతంగా జ్వరం వచ్చింది. రాత్రంతా తనతో పాటు జాగారంచేసి ఉదయం కాఫీ చేసియిచ్చి మళ్ళీ కొంచెం సేపటిలో వస్తానని చెప్పి క్రిందికి వెళ్ళింది సుజాత. ఇంతవరకూ రాలేదు.

బాబు ఆకలికి ఇల్లెగిరిపోయేలా ఏడుస్తున్నాడు. వాడికి పాలుకాచి పత్తేస్ట్రిలో తను లేదు. సుజాత రావలసిందే. వాడు ఏడిస్తే ఆపిల్లప్రాణం కొట్టుకుంటుంది. పిచ్చిపిల్ల తనన్నా వాడన్నా ఎంతో మక్కువ.

బాబిగాడి ఏడుపు తను భరించలేకుండా వుంది. వాడి ఏడుపువింటూనే పైకి పరుగెత్తు కొచ్చే సుజాత అర్ధగంట నుండీ గుక్క పట్టి ఏడుస్తున్నా రాలేదు. పనికాలేదో ఏమిటో? అనుకుంటూ మెల్లగా లేచింది. కళ్ళు తిరిగాయి గోడ ఆసరాగా తీసుకుని మెల్లగా మెట్లదగ్గరకు వెళ్ళింది.

సుజాతా అని బిగ్గరగా పిలిచాననుకుంది. గాని పిలుపు నీరసంగావచ్చి క్రిందికి వినపడ లేదు. పిట్టగోడ పట్టుకుని క్రిందికి వంగి చూసింది. సుజాత పైకి రావటానికి మెట్ల దగ్గరకు వచ్చింది. అమ్మయ్య అనుకుంది ప్రమోద.

'సుజాతా!' అని పిలిచింది పెదతల్లి కమలమ్మ.

"ఏమి" టన్నట్లు లగ ఆమె వైపు చూసింది సుజాత.

'నీవు పైకి వెళ్ళకు' అన్న పెదతల్లితో "ఏం; ఎందుకని" అంది సుజాత ఆశ్చర్యంగా.

"ఆమెకు వట్టి జ్వరంకాదు మసూచి పోసింది. నేనిందాక వెళ్ళివచ్చాను. అది అంటు రోగం. నీవా పెళ్ళికావలసిన దానివి. తల్లిలేని దానివి కనుక ఇంతగా చెబుతున్నాను" అంటూ ఆయాసంగా ఆగింది.

"బాబుచూడు ఎలా ఏడుస్తున్నాడో వాడిని తీసుకుని వస్తానంటూ మెట్లు ఎక్కుతోంది" సుజాత.

"ఆహా, ఉద్ధరించేది బయలుదేరింది, ఆవిడేమన్నా నీకు మేనత్తకూతురా! మేన మామ కూతురా!"

సగం మెట్లెక్కిన సుజాత చటుక్కున వెనుతిరిగి "అంత పెద్దగా అరవకూ; అక్కయ్యగారు వింటే బాధపడతారు" అంటూ వినవినా పైకి వచ్చింది.

ఈ సంభాషణ విన్న ప్రమోద మనసు భయంతో గడ్డకట్టింది. పైకివచ్చిన సుజాత అక్కడే నిలబడిన ప్రమోదను చూసి తప్పు చేసినదానిలా తలదించుకుని బాబును తీసుకుని క్రిందకి వెళ్ళిపోయింది.

భగవాన్ తనకు మశూచియా! తనవారెవరూ దగ్గరలేరు. భర్త కూడా లేకుండా వెళ్ళారు. ఎవరూ లేకుండా తనకీస్థితి ఏమిటి? నెమ్మదిగా తిరిగి ఇంటిలోనికి వెళ్ళింది. అద్దంతో తన ముఖంచూసుకుందామని డ్రాయరు దగ్గర ఒక నిముషం ఆగింది. భయంవేసింది. అయినా అద్దం చేతిలోనికి తీసుకుని చూసుకుంది. అక్కడక్కడా బొబ్బలు కనిపించాయి అద్దంవదిలేసి మెల్లగా మంచంమీద ఒరిగింది. తనకు తెలియకుండానే కన్నీరు చెంపలమీదికి జారుతున్నాయి. తన శరీరం మీద జ్వరపు వేడికన్నా వేడిగావున్న కన్నీరు దిండుమీదపడి లోనికి ఇంకిపోతున్నాయి; తనలోని ఆవేదనలా.

అదెంత భయంకరమైన వ్యాధో తనకు తెలియనిది కాదు. "అక్కా! మాష్టారు వారం రోజుల వరకూ రానన్నారుకాదా; అన్నయ్యను పంపనా? త్వరగా వచ్చేస్తారు" అంది సుజాత ప్రమోద కన్నీటిని బాధగా చూస్తూ. సుజాత వచ్చినట్లు కూడా గమనించలేదు ప్రమోద.

ఏం చెప్పాలో తోచని ప్రమోద బాజీ డమ్మా అని అడిగింది.

''అన్నం తినిపించి కాసేపు ఎత్తుకుని త్రిప్పాను నిద్రపోయాడు'' అంటూనే ప్రమోదకు కాఫీ చేయటానికి వంటింట్లో కెళ్లింది సుజాత.

ప్రమోద మనస్సునిండా భయంకరమైన ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. అందమైన తన ముఖం మచ్చలుపడి వికృతంగా తయారవుతుంది కాబోలు. ఒక మచ్చలున్న మాటేమిటి? అవిటితనం రావచ్చు, గ్రుడ్డి రావచ్చు: అలా జరిగినవారెందరో తనకు తెలుసు. శరీరం భయంతో జలదరించింది.

''నా ప్రాణాలైనా తీసుకుపోగానీ నాకు అంగవైకల్యం మాత్రం కలిగించకు భగవాన్! నేను భరించలేను. కుంటిగానో, గ్రుడ్డిగానో బ్రతకలేను'' అంటూ రెండుచేతులూ కలిపి కనిపించని దేవునికి నమస్కరించింది.

ప్రమోద సౌందర్యారాధకురాలు! అందమైన దృశ్యాన్నిగాని, అందమైన మనుష్యులనుగాని చూసి తన్మయత్వంతో తనను తాను మరచిపోయే ప్రమోద అనాకారులను అసహ్యించుకొంటుంది. అవిటివారిని ఏవగించుకొంటుంది.

ప్రమోద చిన్నతనంలో, వారి గ్రామానికి ఒక బిచ్చకత్తె వచ్చింది. వాకిట నిలబడి అమ్మాజీ బొక్కెడు ముద్దెయ్యిరి నీకాలు మొక్కుత, బంగారుతల్లి నీ చెప్పులు మోస్త నని వేడుకుంటున్నది.

ముద్ద తీసుకుని బయటకువచ్చిన ప్రమోద ఆమెవంక చూసి కెవ్వున కేకవేసి ముద్ద నలాగే నేలమీద పడవేసి గభాలున ఇంటిలోనికి వెళ్లి తలుపులు మూసివేసి వాటినానుకుని నిలబడిపోయింది.

మోకాళ్ల దగ్గరనుండి క్రింద పెద్ద పెద్ద పుళ్ళుపడి రసికారుతున్నవి. చేతివ్రేళ్లు గోళ్లులేక మొండిగా వంకర్లుతిరిగి వున్నాయి. కళ్ల రెప్పలమీద కుంకుడు గింజలంత పొక్కులు కలిగి ఎఱ్ఱగా రక్తం చిమ్ముతూ ఆ రక్తం కళ్లలోనుండే వస్తున్నట్లుంది. పెదవులు ముగ్గిన దోసకాయ పగిలినట్లు పగుళ్లు విచ్చి చీము కారుతున్నాయి. ఇంకా వాకిటిలో నిలబడి బిచ్చగత్తె దీనంగా వేడుకుంటున్నది. ''అమ్మా! కాస్త ముద్దెయ్యిరి'' ''దొరల్లుడొస్తడు'' మీ పాడిపంటలు చల్లగుండాల'', ''ధర్మలొగిళ్లు చల్లగుండాల'' అంటూ.

ఆ మాటలనుకూడా వినలేనట్లు ప్రమోద రెండు చెవులలోనూ తన చూపుడు వ్రేళ్లను బిగించింది. ఆనాటినుండీ ఆ బిచ్చకత్తె కొన్నాళ్లపాటు రోజూ వచ్చేది.

ఆమె కేకలు అవతలి యిళ్లవద్దే విన్న ప్రమోద తలుపులు బిగించి ఆమె తన యింటిని దాటిపోయేకగాని బయటకు వచ్చేది కాదు.

రైలులోనో, బస్సులోనో ప్రయాణంచేసే ప్పుడు ఎవరైనా కుంటి, గ్రుడ్డి బిచ్చగాళ్ళు వస్తే వారికి పైసలిచ్చేదికాదు సరికదా, ముఖాన్ని కిటికీలోనుండి బయటకు పెట్టి ప్రకృతిని చూస్తూ వాళ్లు తనను దాటేసిన తరువాత గాని ఈ వైపుకు తిరిగేది కాదు.

ఈ అవిటితనంతో ''వీరంతా బ్రతకక పోతే నేం'' అనుకునేది; వాళ్ళు బ్రతికి ఉండటమే మహా పాపమైనట్లు. అవన్నీ ప్రమోదకు వరసగా గుర్తు రాసాగాయి. తన యీ అవివేకానికి కనువిప్పు కలుగజేయటానికే దైవం ఇప్పుడీ రోగం రూపంలో తనను శిక్షించబోతున్నాడా!

''తండ్రీ! ఇంత పెద్ద శిక్ష నేను భరించలేను స్వామి'' అంటూ విలపించింది.

''అక్కా! కాఫీ త్రాగు'' అంటూ కుదిపి లేపి కప్పు చేతికిచ్చింది సుజాత. ఆమె స్థితికి సుజాత కెంతైనా జాలిగా వుంది. క్రిందికి వచ్చి అన్నగారిని పంపింది మాష్టారిని తీసుకురమ్మని.

మోహన్‌ని తీసుకు వస్తానని వెళ్లిన సుజాత ''అన్న'' ఆరుమైళ్ళు తమ గ్రామం నుండీ ప్రైయివేటు బస్సులో పడి కట్టుకున్న బట్టలు అంగుళం మందంగా పట్టిన దుమ్ము వంక దిగులుగా చూసుకుంటూబస్టాండుకు వెళ్లాడు. అక్కడ ఒక్క బస్సుకూడా లేదు. ఎవరినో అడిగాడు విజయవాడ వెళ్లే బస్సు ఎన్ని గంటలకు వుందని. అతడప్పుడే అడవి విడచి ఊరిలోనికి వచ్చిన వింతజంతువుని చూసినట్లు చూసి ''ఎక్కడో పిచ్చి మాలోకంలా వున్నావు, ఇవాళ బంద్, ఏ వాహనం రోడ్డు మీద నడవదు'' అన్నాడు.

తిరిగివచ్చిన అన్నగారి యీ మాటలు విని ఉసూరుమంది సుజాత. ఉద్యమం ఉధృతంగా వుంది. ఈ తీవ్రత తగ్గే వరకూ ప్రయాణం చేయలేమని, ఆఖరికి పోష్టు కూడా వెళ్లదు అని చెప్పాడు.

బాబు బాధ్యత పూర్తిగా సుజాత తీసుకుంది. వాడిని పైకి తల్లి దగ్గర కసలు తీసుకు వెళ్లటం లేదు.

ప్రమోదకు పొక్కు లింకా పక్వంగా లేవాయి. ఒళ్ళు పెనంలా కాలిపోతున్నది. దాదాపు అపస్మారక స్థితిలో వుంది.

వేడిగా కాలిపోతున్న శరీరానికి చల్లగా తగిలినట్లై బరువుగా కనురెప్పలు ఎత్తి చూసి అదిరిపడింది ప్రమోద. తాను ఇంటికి వచ్చినప్పటి నుంచి ఏ ఆకారాన్ని చూసి అసహ్యించుకున్నదో ఏ వికృతాకారాన్ని తను కలలోకూడా చూడటాని కిష్టపడదో అదే ఆకారం.

ఎటువైపు చూస్తున్నాడో తెలుసుకోలేనంత మెల్లకన్ను, ముందుకు అంగుళం పొడుగున సాగి బొల్లిమచ్చలున్న క్రిందిపెదవి, పారలవలె పైకి పొడుచుకువచ్చిన పైపళ్ళు, నల్లనిరంగు, నాలుగడుగులు మించని పొట్టి శరీరం కలిగిన వికృతరూపం. తన మంచం పక్కమీద కూర్చుని తనకు వేపమండలతో విసురుచున్నది. కడుపులో చెయ్యిపెట్టి దేవి నట్లైంది. ఒక్క క్షణంకూడా నిన్నునేను చూడలేనట్లు కళ్లు మూసుకుంది ప్రమోద.

పదినెలల క్రితం ప్రమోదభర్త మోహన్‌కు ఈ గ్రామం హైస్కూలుకు ట్రాన్స్‌ఫర్ అయితే ఈ మేడపై భాగంలో అద్దెకు దిగారు. వచ్చిననాడే ఈ వికృతరూపం చూసి ముఖం చిట్లించుకొంది ప్రమోద. డాబా



# మందుమెండ మంచిగంధం

ముగ్గురన్నదమ్ములది పెద్దకోడలు కమలమ్మ వచ్చినది మొదలు తనతో బాగా కలిసి పోయింది ఆమెకు వాక్చాతుర్యం మెండు రెండవ ఆమె బాలింత జబ్బుచేసి చనిపోయిందట ఆమె కూతురే సుజాత పదునాలుగేండ్ల పిల్ల ప్రమోదకు బాగా చేరిక అయ్యింది పిల వాడన్నా తనన్నా ఆపిల్లకి ఆపేక్ష సుజాతంటే ప్రమోదకు తల్లిలేని పిల్ల అని జాలి మూడవ ఆమె ఈ వికృత రూపం లలితమ్మ

లలితమ్మకు ప్రమోదతో మాట్లాడాలని ఎంతో మక్కువ ప్రమోద సుందర రూపాన్ని చాటుగా తనివితీరా చూస్తుంది తనతో ఆమె మాట్లాడే అవకాశం కలుగనివ్వదు ప్రమోద, లలిత భర్త సూర్యం లలితను అపురూపంగా చూసుకోవటం ప్రమోదకు ఒకఅంతుపట్టని వింత

అంత తియ్యగా మాట్లాడె కమలమ్మ సుజాతనుకూడా తనవద్దకు రావద్దని ఆంక్ష పెట్టింది. రూపమే తీపి మనసు విషం కాబోలు ఏ ఆకారాన్ని చూసి తానసహ్యించుకుందో ఆమె, తనకు వచ్చింది భయంకరమైన అంటురోగమని తెలిసికూడా తన మంచంమీద కూర్చుని తనకు సేవచేస్తున్నది ఇది సంభవమా!

"అమ్మా! లేచి కొంచెం ఈ కొబ్బరి నీళ్ళుత్రాగు," అన్న లలితమ్మ మాటలువిని కళ్ళు విప్పింది ప్రమోద

చేతిలోని వేపమండలను ప్రక్కనున్న స్టూలుమీద పెట్టి ప్రమోదను లేపి కూర్చోబెట్టి గ్లాసు నోటికందించింది రెండు గుటకలు వేసి వెంటనే వాంతి చేసుకుంది లలితమ్మగారి చీరంతా ఖరాబయ్యింది నొచ్చుకుంది ప్రమోద లలితమ్మగారి ముఖాన చిరాకుగాని, అప్రసన్నత గాని గోచరించకపోవటంతో ప్రమోద మరింత ఆశ్చర్యపోయింది

ఈ ఊరు వచ్చిన క్రొత్తలో ఏదో పండుగ వస్తే పాయసం పంపింది లలితమ్మ దానిని భర్త చూడకుండా నీళ్ల తూము దగ్గర పోసి కడివెడు నీళ్ళుపోసిన సంఘటన గుర్తు వచ్చింది ప్రమోదకు ఆ చర్య భర్త చూసి చాలా నొచ్చుకున్నారు పెళ్ళయిన దగ్గర నుండీ భార్య వింత మనస్తత్వానికి అతనికి బాధగానే వుంది

వెండిలా మెరిసిపోతున్న వెన్నెలలో డాబా మీద ప్రక్క పరచి భర్త ప్రక్కనే చేరిన ప్రమోదతో "పిచ్చి ప్రేమా! సౌందర్యం శరీరానికె కాదు మనసుకు కూడా వుండాలి మంచిముత్యమంత ఎలువైనదీ మల్లెపూవంత స్వచ్ఛమైనదీ అయిన మనసున్న మనిషికి అందం లేకున్నా లోటు లేదు పరిసరాలను పరిమళ భరితం చేస్తూ సౌందర్యం లేకపోయినా సౌరభం కలిగిన సంపంగి జన్మ చరితార్థం కాదా? మనసుకు సౌందర్యం వున్నపుడే శరీర సౌందర్యానికి రాణింపు అది తెలుసుకున్నపుడే నీవారాధించే సౌందర్యానికి సార్థక్యత" అంటున్న భర్త మాటలను "ఇంత చక్కని వేళలో ఆ గొడవలన్నీ ఎందుకు పోనిస్తురూ" అంటూ తేలికగా కొట్టిపారేసింది వెన్నెల అందాన్ని చూస్తూ మైమరచి భర్త గుండెల పైకి వరిగి ఇపుడదంతా గుర్తుకు వచ్చి మనసు బాధగా మూలిగింది

*

బట్టలు మార్చుకు వచ్చి మరలా వేపమండలు తీసుకు విసురుతూ మంచం మీద కూర్చున్న లలితమ్మ వైపు ఆత్మీయత ఉట్టిపడేలా చూసింది ప్రమోద

"పిన్నీ! నేను మళ్ళీ లేచి మామూలుగా తిరుగుతానంటావా! నేను వారిని చూస్తానా! ఏ కుంటిదాన్నో, గుడ్డిదాన్నో అయిపోనుగదా!" అంటూ వెలగా ఏడ్చింది

"పిచ్చిపిల్ల మసూచి వచ్చిన వారందరూ అంగ వైకల్యం పొంది తీరాలని ఎక్కడా సిద్ధాంతం లేదు పత్యం సరిగ చెయ్యకపోవటం లాటి అవక తవకలు జరిగితే అలాటి ఆపదలు సంభవిస్తాయి నీ కలాటి లోటు జరగకుండా నేను చూసుకుంటానుగా నీ ముఖాన్న గుంటలు కూడా ఎక్కువగా పడకుండా చూడగలను నీవు నిశ్చింతగా వుండు" అంటూ ఓదార్చింది

ప్రలపూటా దిగదుడుపులు తుడిచేది చెరువులోని చంద్రుడు చెప్పింది శరీరానికి పూత పెట్టించేది కన్నతల్లి కన్నా మిన్నగా అహర్నిశలూ, ప్రమోద సంటి పెట్టుకుని సేవ చేసింది లలితమ్మ ప్రమోద అదృష్టమో లలితమ్మ సేవల ఫలితమో ఏ అవిటి తనమూ లేకుండానే తను వచ్చి వెళ్ళిన గురుతుగా ముఖాన అక్కడక్కడా చిన్న చిన్న గుంటలు మిగిల్చి వెళ్ళింది మసూచి

ప్రమోదకు పత్యం పెట్టి నిద్రపోకుండా అతిజాగరూకతతో దగ్గరే కూర్చుని కబుర్లు చెబుతూ కాలక్షేపం చేయించింది

"పిన్నీ! నీదింత గొప్ప మనసు కనుకనే బాబాయిగారు నిన్నంత అపురూపంగా చూసుకుంటున్నారు" ఏంచూసి నిన్ను బాబాయిగారు పెళ్ళాడా"రని అడగాలనుకునే ప్రశ్న ప్రశంశగామారి ప్రమోదచేత యిలా పలికించింది

లలితమ్మ ప్రమోదకు సమాధానమైతే యివ్వలేదుగాని, మనసు మాత్రం పాతిక సంవత్సరాల గతంలోకి దూసుకుపోయింది

* * *

తిరుపతికొండమీద ధర్మదర్శనం కోసం నిలబడి కదలలేక కదులుతున్న క్యూతోపాటు కదిలిపోతున్న లక్ష్మీనారాయణ భుజంమీద ఖరీదైన సూటువేసుకున్న మనిషి తాలూకూ హస్తం బలంగా పడేసరికి ఉలికిపడి ప్రక్కకు తిరిగాడు

అదేపనిగా తన ముఖంవేపే చూస్తున్న లక్ష్మీనారాయణ నుద్దేశించి "నేనురా! పరంధామయ్యను గుర్తుపట్టనేలేదా! నేను నిన్ను చూడగానే పోల్చుకున్నాను' అన్నాడా ఆగంతకుడు ముఖంనిండా సంతోషం పులుముకుని

లక్ష్మీనారాయణ ముఖంలో నవ్వు వెన్నెలలా ప్రాకింది "అరే" "నువ్వటరా! పరం" ఎన్నాళ్ల కెన్నాళ్లకు" అంటూ పరంధామయ్య రెండుచేతులు పట్టుకుని వూపేశాడు

క్యూ జరగకపోయేసరికి వెనుకవారు ఇబ్బందిగా మొఖాలు పెట్టారు అది గమనించిన పరంధామయ్య "దైవదర్శనం తరువాత ఇద్దరం కలిసి చేసుకుందాం, రా" అంటూ ఇవతలికి లాగేశాడు మిత్రుని ఇద్దరూ కలిసి అలా గులాబీ తోటలవేపు వెళ్లారు

వారిద్దరూ ఒకటవ తరగతి నుండీ కలిసి చదివారు ఇరువది సంవత్సరాల విడదీయరాని స్నేహం వారిది ఇరువురి హృదయాలూ ఆనందంతో తేలిపోతున్నాయి

"అవునూ, నువ్వు ఇల్లరికం అంటూ అదేదో పల్లెటూరు వెళ్లావుకదూ! నేను మద్రాసువెళ్లి బిజినెస్ పెట్టి అక్కడే సెటిల్ అయ్యాను డబ్బూ, పలుకుబడీ బాగానే సంపాదించాననుకో ఒక్కతే ఆడపిల్ల" "మరి నీ సంగతేమిటి?" అంటూ మెత్తగా వున్న గడ్డిపరకను గోటితో త్రుంచుతూ అడిగాడు పరంధామయ్య

గులాబీల సౌందర్యాన్ని తిలకిస్తున్న లక్ష్మీనారాయణ "ఆ వెళ్లాను! పల్లెటూరికి ముగ్గురు మగపిల్లలు పెద్దవారిద్దరి పెళ్లిళ్ళూ చేసాను చిన్నవాడు సూర్యం మిగిలాడు, వాడి పెళ్లి కూడా చేసి వానప్రస్థాశ్రమం స్వీకరించటమే తరువాయి పేరు మాత్రమే లక్ష్మీనారాయణగా మిగుల్చుకున్నాను సంపాదించిందేం లేదు

"అయితే నాకోసం ఒక కొడుకును మిగిల్చావన్నమాట! వియ్యమందుదామంటావేమిటి?" అన్న పరంధామయ్యవంక ఎగాదిగాచూసి "చెప్పానుగా పేరు మాత్రమే లక్ష్మీనారాయణ నన్ను లక్ష్మి వరించలేదని. నీకు ఒక్కతే కూతురు పైగా బోలెడు ఆస్తిపాస్తులున్నాయంటున్నావు"

"నిన్ను వరించలేక పోతేనేం ఇపుడు నీకొడుకును వరిస్తుంది మన స్నేహంకన్నా విలువైన వంటావా ఈ ఆస్తిపాస్తులు!" అన్న పరంధామయ్య మాటలని అప్పటికి నవ్వులాటగా తీసిపారేశాడు లక్ష్మీనారాయణ

తిరుగు ప్రయాణమైన నారాయణని "అలా వీలుకాదు మద్రాసువచ్చి నా ఆతిథ్యం స్వీకరించి వెళ్లవలసిందే" నంటూ రెక్కపట్టుకొని లాక్కెళ్లి కార్లో కూలేసాడు.

పరంధామయ్య మాటలను బట్టి తానంచనా వేసుకున్న దానికంటే చాలారెట్లు అధికంగా కనుపించింది అతని అంతస్తు ఇల్లు దేవేంద్ర భవనంలా వుంది మరునాడు

(34వ పేజీ చూడండి)

# చరక సంహిత

దేశెట్టి కేశవరావు



[గత సంచిక తరువాయి]

"మోహన్రావుగారున్నారా?" అనడిగాడు పరంధాం

"అయన మేడమీదున్నారు మీరెవరు ?"

నాపేరు పరంధాంలే! ఆయనతో మాటా డాలి పిలు !" అన్నాడు పరంధాం

"ఇంతకీ మీరేం పనిమీద వచ్చారు ?"

"ఏపనైతే నీకెందుకుగానీ, నువ్వెవరివి యింతకీ ?"

"నేనాయన సెక్రటరీనండి ప్రస్తుతానికి ఆయన్ని పిలుస్తానుండండి" అని వెనక్కి తిరిగాడు వాసు

"ఇదుగో, అబ్బాయ్! ఇలారా నీపేరేమి టన్నావ్ ?"

"నేనేమనలేదండి! అందరూ నన్ను 'వాసు' అని పిలుస్తారండీ నా పూర్తిపేరు వాసుదేవ రావని లందరూ అంటారండీ !"

"భలేవాడివే! ఇంతకీ నీపేరది కాదంటావా ?"

"అదేనండీ! కానీ, నాకింకోపేరేదోవుండి వుంటుందని నా అనుమానమండీ !"

"అదేమిటోయ్! చిత్రంగా వుందే! మీ అమ్మా, నాన్నా నీకేంపేరు పెట్టారో చెప్పలేదా ?"

"నాకెవ్వరూ లేరుసార్ !"

"పోనీ, అక్కయ్యనో, అన్ననో, మేన మామనో, పిన్నినో, ఎవరైనా మీయింట్లో పెద్దవాడినో అడగలేకపోయావా ?"

"నాకు ఎవ్వరూలేరండీ నేనొక్కణ్ణే నండీ! ఈమధ్య వసుంధర మాత్రం, నాకు తను వున్నానంటుందండీ! అయితే అది అంత సులభమైన వ్యవహారం కాదు! అంతా డాక్టరుగారి ఆలోచనపైన ఆధారపడి వుంటుందండీ!" అన్నాడు వాసు

"బాగానే వుందోయ్ నీకథ మరి నిన్నెవరు పెంచారు ? ఎక్కడుంన్నావ్ ? ఎక్కడ పెరిగావ్ ?"

"చిన్నప్పుడెక్కడో వున్నానండీ! ఏదో యింట్లో వున్నట్టున్నానండీ తర్వాత — సరిగా గుర్తులేదు గానీండి — అందరూ పారి పోతున్నారండీ అనక ఎక్కడో తేలానండీ . నాకు బుద్ధి తెలిసినప్పటి నుంచీ యీ వూళ్లోనే వుంటున్నాను సార్! ఫ్రీ హాస్టల్లో వుండి చదువుకున్నాను వసుంధర నాకు కాలేజీలో క్లాస్‌మేటండీ డిబేట్సులో భలే మాట్లాడేది ఒకసారి నేను కూడా ఒక డిబేట్‌లో మాట్లాడానండి ... అదేనండి, నా కలవాటు లేదుగా, ప్రయత్నించానంతే! ఆ రోజు వసుంధరపార్టీయే గెలిచిందనుకోండి! తర్వాత వసు వచ్చి 'మాస్టారూ, మీరు చెప్పకుండా వదిలేసిన పాయింట్లు చాలా గొప్పవండీ! నేనే జడ్జి నయితే మీరే గెలిచినట్టు చెప్పేద్దును' అంది అలా అయిందండీ మా పరిచయం మీరు వసుంధర మాటాడితే విన్నారా, సార్! లేదూ! అయితే మీరు తప్పక వినాలి సర్ ఒక కవి అన్నాడు లెండి పంచదార కన్న వగైరా వగైరాకన్న ఏదో ఏదో కన్న జున్ను కన్న పాయసాన్నము కన్న మరేదో ఏదో అన్నట్టు చలా తియ్యగా మాటాడుతుంది సర్! ఆవిడ కంఠం వింటేనే మహత్తరంగా వుంటుంది లెండి పిలవమంటారా సార్ ?"

"ఎవర్ని ?" విచిత్రంగా వాసుని చూస్తూ అడిగాడు పరంధాం

**జరిగినకధ 3 కెప్సైన్**

మోహనరావు కూతురు వసుందర ప్రియుడు వాసు, 'నగరఢంకా' పత్రికా సంపాదకుడు జయరాం స్నేహితులు తన పత్రికలో ప్రచురించేందుకు మోహనరావు వ్రాస్తున్న వైద్యగ్రంధాన్ని ఎలాగైనా సంపాదించమని వాసుని కోర్తాడు జయరాం జయరాం కోరికని తిరస్కరించినా వసుంధరకోసం ఆమె సలహాపై మోహన్రావ్ దగ్గర సెక్రటరీగా చేరతాడు వాసు పత్రికలోని ప్రకటన చూసి సంగతి తేల్చుకోవాలని తమ్ముడు జయరాంవద్దకు వస్తాడు పరంధాం

"అదే సార్! డాక్టరుగార్ని!"

"అదేనయ్యా నే చెబుతుంట! నేనేదో పొరపాట్న 'నీ పేరేమిటయ్యా?' అనేటప్పటికి కవిలెకట్టలు విప్పుతివి" విసుగ్గా అన్నాడు పరంధాం

"పొరబాటు సార్! ఎందుకో మిమ్మల్ని చూస్తే మాట్లాడాలనిపించిందది అంతే! నే చెప్పినవన్నీ డాక్టరు గారి దగ్గర అనేరు సుమా! నేను యిక్కడి నుంచి వెళ్లిపోవలసి వస్తుంది" అని లోనికి నిష్క్రమించాడు వాసు

కాసేపట్లో, మోహనరావు దిగివచ్చాడు "ఎవరండీ మీరు ? ఏం కావాలి ?" అనడిగాడు డాక్టర్ని చూస్తే అతడు తనకి తెలిసిన వ్యక్తి అని అనిపించలేదు పరంధాంకి "నమస్కారం! నా పేరు పరంధాం!" అన్నాడు

"మంచిది ఏం పని మీదొచ్చారు ? ఎక్కడ నుంచి వచ్చారు ?"

"చాలా దూరం నుంచి వచ్చానులెండి !" ఎక్కడ నుంచి వచ్చినట్టు చెబితే బావుంటుందో అతడికేం తోచలేదు ఇలాంటి ప్రశ్నకి జవాబు చెప్పవలసి వస్తుందని అతడూహించలేదు అయినా ఆపదలందు ధైర్య గుణం వుండాలన్నారు కాబట్టి యీ సమయంలో ఉచితమైన జవాబు యివ్వాలనే నిర్ణయించుకున్నాడు అయినా ఓ పట్టాన ఆలోచన తెగలేదు కాని చటుక్కున జయరాం అన్న మాటలు అతడికి గుర్తుకొచ్చాయి భారత వైద్య విజ్ఞాన సమితి వారు తన పుస్తకానికి బహుమతి నిస్తారని డాక్టరు ఆశ పడుతున్నట్టు జయరాం చెప్పాడు ఇదిబాగానే వుందనుకున్నాడు పరంధాం ఇప్పుడు తన కర్తవ్యం పుస్తకాన్ని సేకరించడమని అతడి కనిపించింది

"అంటె?" అనడిగాడు కెప్సైన్,

"అదే ఢిల్లీ నుంచి వస్తున్నాను!" అన్నాడు పరంధాం భారత వైద్య సమితి ముఖ్య కార్యాలయం ఢిల్లీలో వుంటుందని అతను వూహించాడు

"ఢిల్లీ నించా ?"

"అవును సమితి తరపున ప్రతినిధిగా వస్తున్నాను!"

"సమితి తరపునా?" ఆశ్చర్యంగా అడిగాడు డాక్టర్

"అదే భారతీయ వైద్య విజ్ఞాన సమితి"

"ఓ! అలా చెప్పండి! భావైవిస నుంచి వస్తున్నారా! ఢిల్లీ నుంచి వస్తున్నారన్నమాట!"

"చిత్తం! అంతేనండి!"

"ఏమిటో విశేషం?"

"ఏంలేదూ! మీరు వైద్య గ్రంథం రాస్తున్నట్టు సంఘానికి తెలిసింది వైద్య విజ్ఞానాన్ని ప్రోత్సహించడమన్నది సమితి ఆశయాల్లో ప్రధానమైంది అంచేత దాన్ని పరిశీలించిరమ్మని నన్ను పంపారు మీరా గ్రంథాన్ని నాకో రెండురోజులపాటు యిస్తే — నేను యీ వూళ్ళోనే మకాం చేస్తాను— చదివేం, దాని విషయమై ఒక రిపోర్టు రాసి సమితికి పంపిస్తాను నేను రాసిన రిపోర్టుపైన సమితివాళ్ళొక నిర్ణయం తీసుకుని, మీకు ఎంత బహుమతి యివ్వాలనుకున్నదీ తెలుపగలరు"

"బహుమతి రావడానికి ఎన్ని రోజులు పట్టవచ్చునంటారు?" అనడిగాడు మోహనరావు

"త్వరలోనే వచ్చేస్తుంది నా రిపోర్టు అందిన వెంటనే వాళ్ళొక నిర్ణయం తీసుకోగలరు!"

"అలాగా! అయితే నా దురదృష్టవంతుణ్ణనే చెప్పాలి!" అన్నాడు డాక్టరు

"ఏం అలాగంటున్నారు?"

"నేను పుస్తకం రాయడం యింకా పూర్తి కాలేదు!"

"ఓ అదా మీ బాధ! దాంట్లో మునిగిపోయిందేమీలేదు అసంపూర్ణంగా వున్నా, పుస్తకాన్ని గురించి రిపోర్టు పంపించమని నాకు అధికారం యిచ్చివున్నారు" అని తనకుగల అధికారాలని వివరించాడు పరంధాం

"అమ్మయ్య! అయితే చిక్కేలేదు!" అన్నాడు మోహనరావ్

"ఏదీ మరి పుస్తకం తెప్పించండి! నాకాట్టే వ్యవధిలేదు హోటల్ గదికెళ్ళి, చదవడం ప్రారంభించాలి!" అన్నాడు పరంధాం సామోపాయం యింత సులభంగా సత్ఫలితాల నిస్తుందని అతడూహించలేదు

మోహనరావు లటపటాయించాడు "ఒక్క చిక్కుందండీ! నా చేతివ్రాత మీకు సరిగా అర్థమౌతుందో కాదోనని నా అనుమానం!"

పరంధాం నవ్వేశాడు "నిజమేననుకోండి! డాక్టర్ల చేతివ్రాల గురించి అనేకమైన కథలు వింటుంటాం కదా! అయినా ఫరవాలేదు ఎలాగో అవస్థ పడతాను త్వరగా పుస్తకం తెప్పించండి!"

"నాదొక చిన్న మనవి!" అన్నాడు మర్యాదగా మోహనరావు అతడలా మాటాడుతుంటే, చూసి పరంధాంకి నవ్వొచ్చింది ఇతణ్ణి గురించి జయరాం ఏమేమిటో చెప్పి హడలగొట్టేశాడు తనూ మొదట్లో భయపడినమాట వాస్తవం కాని ఇప్పుడు చూడు! బహుమతి అనగానే ఎలా నంగినంగిగా, తమ్కూతరుతూ ప్రవర్తిస్తున్నాడో! డబ్బు మనుషుల్ని అలా తయారుచేస్తుంది

ధనమా! నీకెంతటి శక్తి గలదు! సింహమునైనను పిల్లిగా మార్చుట నీకే సాధ్యము గదా!

"ఏమిటండీ?" అనడిగాడు పరంధాం

"నా పుస్తకాన్ని ఎంతో జాగ్రత్తగ "

"మీకా భయం అక్కర్లేదు నా ప్రాణంతో సమానంగా చూసుకుంటాను, నవేనా? పువ్వుల్లోపెట్టి దాన్ని మీకు తిరిగి అప్పగించే బాధ్యత నాది, ఏమంటారు?"

"పోనీ, ఒకపని చేస్తే! మీరు ఈ రెండు రోజులూ మా యింట్లోనే అతిథిగా వుండిపోకూడదూ! ఇక్కడే మీరు నా పుస్తకాన్ని సరిగ్గా పరిశీలించవచ్చుగా!" అన్నాడు డాక్టరు

పరంధాం యిరుకున పడ్డాడు ఈ సూచనకు ఆమోదిస్తే తన పథకానికి చిక్కులొస్తాయి ఆయన పుస్తకమిస్తే చంకన బెట్టుకుని తిరిగి చూడకుండా ఒకేసారి వెళ్ళిపోవడం హాయి అందుకే అన్నాడు "అబ్బే! అది కుదరదండీ! మీకు అతిథిగా వుండడం ఢిల్లీలో అపార్థాలకి దారితీస్తుంది!"

'అదీ నిజమే ననుకోండి!" అన్నాడు ఏటూ తోచనట్టు డాక్టరు

"మరి పుస్తకం తెప్పించండి! వేళ మిగిలిపోతోంది!"

"సెక్రటరీ!" పిలిచాడు డాక్టరు వాసు వచ్చాక "అలమారా తాళంచెవు ఎక్కడున్నాయో వెదుకు" అని ఫర్మాయించాడు



## రాలిన ముత్యాలు

. . . . శ్రీ సోమసుందర్ . . . .

అమ్మాయి ఉద్యోగంచేసి ఇల్లు నడుపు
తున్నా
అణగి మణిగి నమ్రతగా బ్రతకాలి
అబ్బాయి ఉత్త పోరంబోకు వెధవల్లే
తిరుగుతున్నా
రివిగా తలెత్తుకుని హాయిగా ఆగడం
చేయొచ్చు!
తల్లిదండ్రుల దృష్టిలో — అమ్మాయి
బరువు! అబ్బాయి ఎరువు!

"అయితే మీరు ఢిల్లీనించి వస్తున్నారన్న మాట!" అన్నాడు డాక్టరు

"అవు!"

"అన్నట్టు మరిచాను! నాలుగు నెలల క్రిందట సమితివారు తమ హెడ్‌క్వార్టర్సుని నాగపూర్‌కి మారుస్తున్నట్టు వాళ్ల పత్రిక 'మెడికల్ నోట్సు'లో వేశారే? ఇంకా మార్చలేదా?"

ఈ ప్రశ్నకి పరంధాం దగ్గర జవాబు సిద్ధంగ లేదు ఆ సమితివాళ్లు యిలాంటి చిన్న చిన్న వార్తల్నికూడా వాళ్ళ పత్రికలో వేసేవుండొచ్చు అయినా యిప్పుడేం చెప్పాలో తోచక అలాగె చూస్తూ వుండిపోయాడు పరంధాం

"ఒకటయి వుండొచ్చు వాళ్లు మార్చాలనుకుని వుంటారు కానీ యింకా మార్చాలేదు! అంతేకదూ!" అన్నాడు డాక్టరు

"అంతే! అంతే! త్వరలో మారుస్తారేమో, మరి!" అన్నాడు పరంధాం ఇప్పుడిప్పుడే అతడికి డాక్టరంటే గౌరవం పుడుతోంది పాపం, అతణ్ణిలా మోసం చెయ్యడం అన్యాయమనిపించింది కూడా

"అన్నట్టు ప్రస్తుతం సమితి అధ్యక్షుడెవరు?" అనడిగాడు డాక్టరు

"చచ్చాం! మళ్ళీ సంకట పరిస్థితి తయారయ్యిందే! దీన్నెలా దాటుకోవాలో అతడికర్థంకాలేదు కాబట్టి గొంతు సవరించుకుని "అతడూ అతడి పేరేమిటబ్బా! " అని ఆలోచన నటించాడు

"ఆఁ! కులకర్ణి కదూ!" అని అందించాడు కెప్టెను.

## చరకసంహిత

"అవునవును. కులకర్ణి!" నిట్టూర్చాడు పరంధాం

"సమితి ఎన్నికలు ఎప్పుడు జరుగుతాయో"

ఈ ప్రశ్న పెద్ద కష్టమయిందిగా తోచలేదు ఎప్పుడో వొకసారి జరగనే జరుగుతాయి "త్వరలో జరగొచ్చు సుమారు ఒక అయిదారు నెలలైనా పడుతుందని అంచనా" అన్నాడు సమితి అంతరంగ విషయాలన్నీ ఆకళించుకున్న వాడిలా

"నా కొకటే విచిత్రంగా వుంది! నిన్ననె నాకు సమితి అధ్యక్షుడి నుంచి వుత్తరం వచ్చింది దాంట్లో మిమ్మల్ని పంపుతున్నట్టు ఆయన రాయలేదు" అన్నాడు డాక్టరు

పరంధాం నిశ్చేష్టుడై చూశాడు అతడికి నోట మాట రాలేదు చెమట కూడా పోస్తున్నట్టనిపించింది 'ఎన్ని కష్టాలు కలిగించావురా భగవాన్!' అనుకున్నాడు అతడు

ఇంతలో వాసు వచ్చాడు, "తాళాలు కనబడలేదు సార్!" అంటూ

"తాళాలు నా దగ్గరే వున్నాయిలే! చూడు నా గదిలో భారతీయ వైద్య విజ్ఞాన సమితి వారి లెటర్ హెడ్డు వుంటుంది' ఒక కాయితం చింపి ఆయనకి తెచ్చియియ్యి చదువుకుంటాడు" అని వాసు వెళ్లాక "అది చదవండి! దానివల్ల మీకు చాలా విషయాలు తెలుస్తాయి సమితి హెడ్‌క్వార్టర్సు నాగపూరుకు మార్చి మూడు నెలలయింది సమితికి ఎన్నికలు జరిగి పదిహేను రోజులయింది సమితి అధ్యక్షుడుగా ఎన్నికయిన డాక్టర్ చంద్రశేఖర్—కులకర్ణి కాదు—అసలు కులకర్ణి అనే పేరు గలాయన పది ఏండ్ల నించీ అధ్యక్షుడుగా లేనేలేడు—నిన్ననే నేను జాయింటు సెక్రటరీగా ఎన్నికయినందుకు అభినందిస్తూ వుత్తరం రాశాడు తీసుకోండి!" అన్నాడు వాసు తెచ్చియిచ్చిన కాయితాన్ని ఆతనికి అందిస్తూ "మరెప్పుడూ యిలాంటి పనుల్లోకి దిగకండి! నమస్తే!" అని చర చరా మెట్లెక్కి వెళ్లిపోయాడు

పైసా అంత సైజు మొహం చేసుకుని వెళ్లిపోతున్న పరంధాంని చూస్తూ వాసు అలాగే నిలబడి పోయాడు, ఏమీ అర్థం కాక

* * *

భోజనం చేసి చుట్ట కాల్చుకుంటూ పడక్కుర్చీలో కూర్చున్నాడు పరంధాం. యీ వెధవయింట్లో వుక్కపోస్తున్నట్టుంది 'ఓ మంచి యిల్లు అద్దెకు తీసుకుని పత్రిక నడపాలని జ్ఞానం లేదు వెధవకి!' అనుకున్నాడు పరంధాం అతడికసలే కోపంగా వుంది మధ్యాహ్నం ఏదైనా ఆచూకీ దొరుకుతుందేమోనని మోహన్‌రావింటికి వెళ్లాడు అసలతడు తనకి కావలసినవాడో కాదో తెలియలేదు సరిగదా లేనిపోని అబద్ధాలాడి వూబిలో యిరుక్కుపోయాడు ఇక యిప్పుడు చెయ్యవలసిన పని ఒకటే వుంది! ఆ డాక్టరుగారి రహస్యం కనుక్కోవడం! లేదా

అక్కడితో అతడి ఆలోచనా ప్రవాహం ఆగిపోయింది మళ్లీ వుక్కపోస్తున్నట్టుంది

"అరేయ్! ఫేన్ తగలెట్రా" అని కేక వేశాడు

పక్క గదిలో పోయినవారం మిగిలిపోయిన పత్రిక ప్రతుల్ని లెక్కవేసి కేజీల చొప్పున అమ్మడానికి కట్టలు కడుతున్న జయరాం పరిగెత్తుకుంటూ పరంధాం వున్న గదిలోకి వచ్చాడు

"అగ్గిపెట్టె లేదన్నయ్యా!" అన్నాడు

"అగ్గిపెట్టెవిట్రా?" అనడిగాడు పరంధాం

"కావాలన్నా వేమోననుకొని"

"నీ మొహం వుక్కపోస్తోంది! ఫేన్ తగలెట్టమన్నాను" అన్నాడు పరంధాం

"ఓ అదా! అది పనిచెయ్యదురే! ఇది

## ఇరుగు

మేము ఇదివరకున్న వూళ్లో ప్రక్కవాటాలోఆమె ఓరోజు' ఇంట్లో తిన్నా తినకున్నా హాయిగా బ్రతకొచ్చు గాని మంచి పొరుగు లేకపోతే కష్టమే సుమండీ" అంది నాతో నేను ఆశ్చర్యంగా మనం బ్రతకటానికీ, పొరుగు వారికీ సంబంధం ఏమిటండీ అంటే ఆవిడ సమాధానంగా "ఇంట్లో వాళ్లయితే కొన్నింటికే తప్పు పడతారు పొరుగువాళ్లకి కట్టుకున్న చీరనుంచి భర్తతో బయటకు వెళ్లటం వరకూ తప్పే — అన్నిటికీ సంజాయిషీలు ఇచ్చుకోవాలి" అంటే నేను నమ్మలేక పోయాను

ఈవూర్లో మా ఇంటెదురుగుండా

వినసక్రగా వాడుకో'' అని నాలుగు పాత సంచికల్ని మడిచి యిచ్చాడు

జయరాం వెళ్లిపోయాక, పరంధాం తిరిగి ఆలోచనల్లో పడిపోయాడు తనకు కావలసిన మోహన్రావుయితడేనా ? చిన్నప్పుడెప్పుడో చూశాడతన్ని సుమారొక యిరవైయేళ్లుయి వుండొచ్చు అప్పుడు చూసిన మనిషిని గుర్తుంచుకోవడం కష్టమే! కాని అతడి మాటల్లో పరిచితమైన ధోరణ ఏదో స్ఫురిస్తోంది ముఖ్యంగా ఆ తల విసరడం!

అతడు పరిచితుడైన మోహన్రావే అనుకుందాం! ఋజువెట్లా? ఆ పుస్తకం ఇంకా ఆయనదగ్గరే వున్నదా? అది వుంటే ఖచ్చితమైన ఋజువు దొరికినట్టే లేకున్నా అతడేదైనా డైరీ లాంటిది రాసుకొని వుండొచ్చు అదిం దొరికినా మంచిదే కాబట్టి ముఖ్యంగా చెయ్యవలసిన పనేమంటే వాటికోసం ప్రయత్నించడం రెండోది, యీ మోహన్రావు యింకొకడయినట్లయితే, ఆయన రాస్తున్న పుస్తకాన్ని సేకరించడం, ఆ వైద్యగ్రంథం మాత్రం ప్రచురణ కారాదు

అను చెయ్యవలసిన పని ఏమిటో పరంధాంకి కచ్చితంగా తెలిసిపోయింది తనకి మోహన్రావు దగ్గర్నించి మూడు పుస్తకాలు కావాలి

(1) తనకు కావలసిన పుస్తకం—పాతది, బాబాయి రాసింది

(2) మోహన్రావు రాసుకున్న డైరీ—ఇదీ పాతదే

(3) మోహన్రావు రాస్తున్న వైద్య గ్రంథం

మొదటి రెండింటిలో ఏ ఒక్కటి దొరికినా, మిగిలినదానితో పనిలేదు అవి దొరక్కపోయినట్టయితేనే, మిగిలిన పుస్తకంతో పని

సరే! ఇక ఆలోచనలతో కాలం వృధాచెయ్యడం అనవసరం టైంచూసుకున్నాడు, తొమ్మిదింబావు కావస్తోంది

రెవి, చొక్కా చెప్పులూ వేసుకుని గది గుమ్మం దగ్గరికివచ్చాడు బయటికి చుట్టని విసిరేసి, పక్క గదివంకకు చూశాడు విద్యుద్దీపం కాంతిలో ఏదో సర్దుకుంటూన్న జయరాం కనిపించాడు పరంధాం కాసేపు తటపటాయించాడు వాడితో చెప్పి వెళ్దామా వద్దా అని ఆలోచించాడు చివరికి, వాడిలో చెప్పకుండా వెళ్తేనే బాగుంటుందని నిశ్చయించుకున్నాడు అన్నయ్య అలా షికారుకి వెళ్ళి వచ్చాడని వాడనుకుంటాడు

జోళ్లు చప్పుడు చెయ్యకుండా మెల్లిగా బయటికి నడిచాడు పరంధాం

కాసేపటివరకూ ఏమీ జరగలేదు తర్వాత జయరాం ''అన్నయ్యా!'' అంటూ ఆగదిలోకి వచ్చాడు పడకకుర్చీ ఖాళీగా వుండటం చూసి గబగబా రెండు బెంచీలని దగ్గరకు లాగి మంచం లాంటిది తయారు చేశాడు దాని పైన ఓ దుప్పటి పరచి, తలగడగా వుపయోగించుకోడానికి కొన్ని పత్రికల కట్టలుంచాడు తర్వాత పక్కగదిలోకెళ్లి మరికొన్ని పత్రికల ప్రతులతో ఒక పక్కలాంటిది తయారుచేసుకున్నాడు దానిపైన ఒక దుప్పటి పరుచుకున్నాడు ఇది తన పక్క అన్నయ్య షికారు కెళ్లినట్లున్నాడు వచ్చి, పక్కగదిలో బల్ల మీద పడుకుంటాడు ఇంతలో తను చెయ్యవలసిన ముఖ్యమైన కార్యక్రమం ఒకటుంది కాలం అనవసరంగా వృథా చెయ్యడం లతడికి యిష్టంలేదు దొరికిన వ్యవధిని సద్వినియోగపరచుకోనివాడు వ్యర్థుడే అని ఎవరో రచయిత ఏదో పుస్తకంలో రాసినట్టు అతడికి గుర్తుంది కాబట్టే యిప్పుడు తన ప్రయోజకత్వం నిరూపించుకోవాలి

పక్కలు వెయ్యడం పూర్తి అయ్యాక, గబగబా చొక్కా, జోళ్లు వేసుకుని, గది తలుపులు దగ్గరగా వేసి, వరండాలో నిలబడి, ఒకసారి తిరిగి తలుపులవంకకి చూసి, చీకట్లోకి నిష్క్రమించాడు జయరాం

ఆకాశం నిర్మలంగావుంది యామినీకాంత కప్పుకున్న నల్లనిచీర మీద జరీ అంచులా మెరుస్తున్నాయి నక్షత్రాలు ఉండి, ఉండి వీస్తున్న పిల్లతెమ్మెరలు నిశాభిసారిక నిట్టూర్పుల్లా వున్నాయి రాత్రి అనే వేదికమీద నిశ్శబ్దం భరతనాట్యం చేస్తున్నట్టుంది ప్రేక్షకుల్లాంటి చెట్లు నిశ్శబ్దంగా యీ నాట్యాన్ని తిలకిస్తూ తలలూగిస్తున్నాయి, తన్మయత్వం చెందిన రసికశిఖామణుల్లా

డాక్టరుగారి యిల్లు యీ ప్రశాంత వాతావరణంలో నిదురిస్తున్నట్టుగా వుంది నిర్విరామంగా సంధ్యాతాండవంచేసిన పరమశివుడు, అలసి సొలసి విశ్రాంతికొరకు నిష్క్రమించగా, ప్రమథగణాలు ఎక్కడివారక్కడే గ్లానితో సోలిపోగా, నీరవత ఆవరించిన కైలాసగిరిలా వుందా భవనం, అక్కడక్కడా గదుల్లో వెలుగుతున్న 'చీకటిదీపా'ల కాంతులు మాత్రం మత్తుగా కిటికీలలోనుంచి కనవస్తున్నాయ్ వరండాలోని ఆరు పులి తలల కళ్ళూ, పేలవమైన దీపపుకాంతుల్ని ప్రతిఫలించి మిలమిలా మెరుస్తున్నాయ్ మహా భయంకరంగావుందా దృశ్యం! వెలుపల స్వాప్నికమైన మాధుర్యమేదో కమ్మేసినట్టుంది వాతావరణాన్ని, అయినా తుఫాను బద్దలయ్యేముందు ఆవహించిన ప్రశాంతతలాగా భయంగొల్పుతూనే వుందా నిస్తబ్దత సమయం పదకొండు గంటలయింది

ఏమీ జరగలేదు గడియారం నిరంతరం

## పొరుగుల పోరు...

కమలమ్మ, విమలమ్మ అని ఇద్దరుండేవాళ్ళు, ఇద్దరి భర్తలూ ఉద్యోగస్థులు, పలుకుబడి వున్నవాళ్లూను కమలమ్మ తను తన యిల్లులా వుంటే విమలమ్మ ప్రతివారితో స్నేహితంగా వుండటం మధ్య మధ్యలో పేచీలుపడి మళ్లీ కలిసిపోవటం చేస్తూండేది ప్రక్క వాటా కమలమ్మతో విమలమ్మ ప్రతి చిన్న విషయానికీ రాద్ధాంతంచేసి పోట్లాట పెట్టుకున్నా ఆవిడ పట్టనట్లూరుకొనేది నాకు విమలమ్మకు బుద్ధి చెప్పాలనున్నా ఆవిడ నోటికి భయపడి వూరుకొనేదాన్ని ఇంతలో ఓ రోజు విమలమ్మగారి పూలచెట్లన పూలుకోసి కింద పడేసి వున్నాయట యిళ్లల్లో మగవాళ్లున్నా విమలమ్మ కమలమ్మనీ, పిల్లల్నీ పూలు కోసారని తిట్టసాగింది దానికి కమలమ్మ మేము కోయలేదు ఎవరు కోశారో మాకు తెలీదు—తెలీకుండా తిట్టడం మంచిది కాదన్నా విమలమ్మ వూరుకోలేదు ఈ తగాదా విన్న మేము చాలా ఆశ్చర్యపోయాం

ఇంతకీ నేను చెప్పొచ్చే దేమిటంటే పొరుగువాళ్ళు మనతో సఖ్యంగా వుండకపోయినా మనల్ని మనుష్యులుగా గుర్తించి మన మానాన్న మనల్ని వదిలేసినా మంచిదే అని

— శ్రీమతి మన్నవ సౌభాగ్యలక్ష్మి

# చరకసంహిత

చేసే ప్రయాణపు టడుగుల చప్పుడుమాత్రం వినిపిస్తోంది.

మరో అరగంట గడిచింది.

డాక్టరుగారి యింటిగేటు తెరుచుకున్నట్టుయింది. ఒక నల్లని ఆకారం లోనికి ప్రవేశించినట్టుయింది. అది మెల్లగా వరండా వరకూవచ్చి హాలుగది తలుపు తెరవడానికి ప్రయత్నించింది. తలుపువచ్చినట్టు లేదు. గల గలామని ఏదో చప్పుడు వినవచ్చింది. ఈ తలుపు తెరుచుకుంది. తిరిగి తలుపు మూసుకుంది. యధావిధిగా నిశ్శబ్దం మరి కొంతసేపు రాజ్యమేలింది.

ఒక ఆకారం ఇంటి వెనకభాగంనించి వచ్చింది. దిక్కులుచూస్తూ, మెల్లగా తారట్లాడుతూ, జాగ్రత్తగా ఆ ఆకారం తోటలోకి ప్రవేశించింది. అక్కడ కాసేపు నిలబడి, గబుక్కున అక్కడున్న పొదక్రిందికి వంగి అదృశ్యమైపోయింది.

ఒక్క క్షణంలో అంతా తికమకగా తయారైంది. తలుపు తెరుచుకున్న చప్పుడయింది. అది గేటు తెరుచుకున్న చప్పుడో, హాలు తెరుచుకున్న చప్పుడో తెలియదు. ఒక ఆకారం ఇంటివేపు నుంచి పరిగెత్తుతూ గేటు వేపు రాసాగింది, ఆ ఆకారం చేతుల్లో ఏవో వస్తువులున్నాయి. అదే సమయానికి మరొక ఆకారం గేటు దగ్గరనుంచి యింటివేపుగా పరిగెత్తుతూ రావడం జరిగింది. ఈ రెండు ఆకారాలూ చీకటి రోడ్డుమీద, లైట్లులేని లారీలు 'ఢీ' కొన్నట్టు, ఒకదాన్ని ఒకటి ఢీ కొన్నాయి. ఆ ఢీ కొట్టడంలో ఏదో వస్తువు కిందబడింది. క్షణంలో అది పొద వెనకకి మాయమైంది. పొద వెనకనించి ఏదో పాములాంటి ఆకారం, ఆ వస్తువుని లాగేసుకుంది.

ఒక ఆకారం క్రిందికి వంగి, చీకట్లో ఆ వస్తువుకోసం తడిమి చూసింది. ప్రయత్నం నిష్ఫలమని గ్రహించినట్టు వెంటనే లేచి, గబగబా గేటువైపుకు వెళ్ళిపోయింది. ఒక ఆకారం యింటివైపు దారితీసింది. గదుల తలుపులని తెరవడానికి ప్రయత్నిస్తూ ఆ ఆకారం అటూ, యిటూ తిరిగింది. హాలు తలుపుదగ్గరకు వచ్చేటప్పటికి, అది సులభంగా తెరుచుకున్న సంగతి గమనించి, "హాయ్"అని లోగొంతుకలో సంతోష సూచకంగా' విజయనాదంచేసి, లోపలికి వెళ్ళి తలుపు మూసుకుంది. కాసేపటికి మరో ఆకారం పొదల క్రిందినుంచి లేచి, చేతిలో వస్తువుని జాగ్రత్తగా దేహంమీద చేతులతో అదిమిపెట్టి, తడబడకుండా, తొణక్కుండా, రాత్రిపూట కచ్చితంగా చూడగలిగే జంతువులాగా యింటి వెనకకి నడిచివెళ్ళింది.

డాక్టరు మోహనరావు సరిగా నిద్రించే వ్యక్తి కాదు. పడుకున్న వెంటనేగానీ, తెల్లవారు ఘడియల్లోగాని అతనికి భయంకరమైన కలలు వస్తుంటాయి. ఈ అలవాటు యిప్పటిదిగాదు. అతడు మిలటరీలో చేరక ముందు నుంచీ యీ బాధ అతడికి వుంటూనేవుంది. అయితే యీ కలలన్నీ ఒకే పద్ధతి ప్రకారం రావడంవల్ల, మొదట్లో అతడికి వీటివల్ల బాధ అనిపించినా, చివరికి సర్దుకుపోవడం నేర్చుకున్నాడు. ఈ కలల్లో ఒక క్రమం వుంది. ముందుగా అతడికి ఎవరో ప్రజా సమూహం పారిపోతున్నట్టు కలవస్తుంది, అంతే తట్టా, బుట్టా, ముటా, ముల్లే సర్దుకుంటుంటారు. అంతలో తను సీట్లో కూర్చుని కారు నడుపుతున్నట్టు కనిపిస్తుంది. తను కారు నడుపుతుంటాడు గాని, ఏదో మరచిపోయానన్న భావం కలుగుతుంది. ఇంతలో తటాలున ఎవరో మనిషి అడ్డంరాగా సడన్ బ్రేకువేసి కారు ఆపుతాడు. ఆ వ్యక్తి తనకు తెలిసిన వ్యక్తే. అతణ్ణి చూడగానే అతడికి చెమటలు పడ్డాయి. వెంటనే మెలకువ వస్తుంది.

ఇప్పుడూ అలాగే మెలకువ వచ్చింది మోహనరావుకి. గదిలో విద్యుద్దీపం సన్నని కాంతి ప్రసరిస్తోంది. మోహనరావు దుప్పటితో చెమట తుడుచుకుని, కదలకుండా పడుకున్నాడు. ఇంతలో యింటి క్రింద భాగం నుంచి ఏదో చప్పుడు వినవచ్చింది. అల్మారాలు తెరిచినట్టు, మేజాసొరుగులు బయటికి లాగినట్టూ వున్నదా చప్పుడు. ఎవరైనా ఏదైనా సర్దుతున్నారా? తలతిప్పి గడియారం వంకకి చూశాడు. పన్నెండు కావస్తోంది. ఇలాంటప్పుడు యీ యింట్లో చప్పుడు వినబడిందంటే... మోహన్రావు లేచి, దుప్పటి పక్కకను విసిరేసి, మంచం క్రిందవున్న జోళ్ళని వేసుకున్నాడు. చప్పుడు కాకుండా గోడదగ్గరకి వెళ్ళి తుపాకి తీసుకున్నాడు. సడి చెయ్యకుండా మెల్లగా గది తలుపు తెరిచి, క్రిందికి దిగాడు.

(37 వ పేజీ చూడండి)

సీరియల్

# కాలమిచ్చిన తీర్పు

'అన్నపూర్ణ'

(గత సంచిక తరువాయి)

"రమేష్ విషయంలో నిన్నొక సలహా అడగాలని వచ్చాను అన్నయ్యా"

"ఏమిటమ్మా అది? మళ్ళీ ఏమైనా అన్నాడా నిన్ను?"

"అది మామూలేగా మాకు? అంగాను గురించి కాదన్నయ్యా నేను వచ్చింది"

"మరి?"

"తనకిక ఉద్యోగం దొరకదని తెలిపోయిందట ఈ ఉద్యోగాలు ఇవ్వలేనివాళ్ళకు ఏదో స్కీము క్రింద కొంత పెట్టుబడి పెట్టి వీళ్ళచేత వ్యాపారాలు పెట్టిస్తోందటగా గవర్నమెంటు?"

"అవునమ్మా సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ స్కీమని ఒకటి పెట్టారులే మనం పెట్టదలుచుకున్న వ్యాపారం వగైరాల ప్లాను, ఎస్టిమేటు అన్నీ ఇస్తే దానికి అవసరమైన పెట్టుబడి పెడతారు బ్యాంకివాళ్ళు వాళ్ళిచ్చేదాంట్లో కొంత పర్సెంట్ మనమూ భరించాలి వ్యాపారం పెట్టాక ఇన్‌స్టాల్‌మెంట్ పద్ధతిమీద తీసుకున్న డబ్బు ఆ బ్యాంకీ వాళ్ళకు తిరిగి ఇచ్చెయ్యాలి కానీ, ఇదంతా నిర్వహించటానికి మనలో ఎంతో జాగ్రత్త ఉండాలి"

"నేనూ వాడితో అదే అన్నాను అయితే, వెనుకటిలా చేయనని మాట ఇచ్చాడు అసలు మొదట్నుంచీ వాడి మనసు ఉద్యోగాల మీదకంటే వ్యాపారాలమీదే ఉంది పోనీ, ఈ ఒక్కసారికీ చూద్దామని ఉంది నాకు"

"అలాగే చెయ్యి సీతా ఏ మనిషి ఎందులో ఉత్సాహం చూపితే అందులోనే పైకి రావటానికి అవకాశం ఉంది వాడంత మోజు పడుతున్నప్పుడు మనం కాదనటం దేనికి? ఒకవేళ వాడికీ బాగుపడే రోజులు వచ్చాయేమోలే!"

"నా ఆశ అదే అన్నయ్యా అయితే దీనికి చాలా తతంగం ఉందట కద? ఎలాగైనా నీవు పూనుకుంటేనే అవుతుందిట ఈ పని ఇది అడగటానికే నాడు నన్నిక్కడికి పంపాడు"

"సరే సీతా రమేష్ నాకు మాత్రం పరాయి వాడా? మేనల్లుడు! వాడి శ్రేయస్సే నాకు కావాలసింది అలాగే నాకు చేతనయిన సహాయం వాడికి చేసిపెడతాను"

ఈలోగా సుందరే అక్కడికి కాఫీలు పట్టుకు వచ్చింది

"సుమ ఎక్కడికి వెళ్ళింది వదినా, కనిపించ లేదు?" కాఫీ అందుకొంటూ అడిగింది సీతమ్మ

"దానికి ఇంట్లో క్షణం కాలు నిలువదు సీతా ఏ స్నేహితురాలి ఇంటికో వెళ్ళిఉంటుంది ఒక్క సుజాతే రోగాలపాలైన నా చేతికి కాలుకు అడ్డు వస్తోంది అదే లేకపోతే నే నేమయ్యేదాన్నో ఈ ఇంట్లో" అంటూ నడుముమీద చేయి వేసుకొని "అబ్బ" అంది సుందరి

"మొదలైంది" – సుబ్బరామయ్య నవ్వాడు, భార్య ముఖంలోకే చూస్తూ

"నన్ను చూస్తే మీకెప్పుడూ ఇలాగే ఉంటుంది" – సుందరి నవ్వుతూనే అంది

వాళ్ళిద్దరి మాటతీరు చూసి సీతమ్మకూడా సన్నగా నవ్వింది

## 5

ఆవేళ ఆదివారం సుబ్బరామయ్య ఇంటిదగ్గర తీరుబడిగానే కూర్చొని ఉన్నాడు

ఉదయం తొమ్మిది గంటల సమయంలో రమేష్ వచ్చాడు విషయమేమిటని అడిగితే,

"అమ్మ నీతో మాట్లాడిందట కద మామయ్యా" అంటూ తన మాటగుర్తుచేశాడు



**జరిగిన కథ 2** సుబ్బరామయ్య సుందరిల సంతానం సుజాత, సుమ, సుధాకర్‌లు సుజాత అనాకారితనాన్ని ఏవగించుకునే సుమ, మెడిసనే చదవాలని పట్టుబట్టే సుధాకర్‌ల వల్ల కలత చెందుతాడు సుబ్బరామయ్య తన అల్లుడికి వుద్యోగం ఇప్పించమని బాల్యమిత్రుడు రామనాథం సుబ్బరామయ్యని కోర్తాడు సుబ్బరామయ్య చెల్లెలు సీత కొడుకు రమేష్ దుర్వ్యసనాల పాలవుతాడు

## ఉగాది పాట

— వీరాజి

కాలం గ్రుచ్చిన మరో హాలా
హాలం పూసిన కత్తిలా
మొన కెత్తుతావో
వసంత కాలం విచ్చిన
అందాల పూల బాలవై
గుబాళిస్తావో నలమా!

ఇది

అనలనామ సంవత్సరం మటుకు
కానివ్వకుము
ఇది వెతలబాపు
'హల' నామ సంవత్సరమై
అవతరించ రమ్మ
కష్టజీవుల పాలిట
జయ నామ సంవత్సరమై
తరలిపొమ్మ
'అన్న'మో రామచంద్రుడా
'ఇల్లో' లక్ష్మణుడా అన్న
అరుపులు వినిపించకుండా
కూడూ గూడూ ఏర్పడే
కల్యాణ మార్గాని కొక్క
మైలురాయివై నిల్చు చందాన
నలమా! ఒక 'వర్ణ' చిత్రానివై
వెల్గిపొమ్మ కవి హృదయాన!

'ఓహో'' అంటూ ''నువ్వు పెట్టదలుచుకున్న వ్యాపారమేమిటి ?'' — ఆ వివరాలు అడిగాడు

తానొక బుక్‌స్టాల్ పెట్టదలచుకున్నట్లు చెప్పి, ''ఈ సహాయం నువ్వు చేసిపెట్టాలి తప్పదు' అన్నాడు రమేష్ బ్రతిమిలాడుతున్నట్లే

లతడి ఆ మాటలు విన్న సుబ్బరామయ్యకు ఏసాళానికి అంటుకుపోయింది

ఇది తనకు తప్పదుట! ఆనాడు సీత అంత చెప్పినా లక చావక ఆడపిల్ల తండ్రిగా తను చాటున రమేష్‌ను లడిగడు సుజాత విషయం ''ఇది నీకు తప్పదురా' అని ప్రాధేయపడ్డాడు అప్పుడు ఏమన్నాడు వాడు ?

''ఎంత చెడిపోయినవాణ్ణయినా — నాకూ ఒక మనసు ఉంటుందన్న విషయం మరిచిపోకు మామయ్య జీవితం మీద నాకూ ఆశలున్నాయి ఇపుడు నీ బలవంతంవల్ల నేను సుజాతను చేసుకున్నా తర్వాత మా జీవితం సాఫీగా సాగిపోతుందని నేను అనుకోను నిజం నిష్ఠూరంగానే ఉండొచ్చు కానీ, నేను చెబుతున్నది యదార్థం మామయ్యా'' అన్నాడు

ఆ మాటలు విన్నతర్వాత ఎటువంటివాడైనా వాడిలో కొంతవరకు నీతి నిజాయితీలు ఉన్నట్లే తోచింది తనకు అందుకే ఉన్న మాటేదో దాచుకోకుండా అనేశాడు తన ఆశ పూర్తిగా నిరాశయిపోయింది అంత వ్యతిరేకంగా మాట్లాడినా వాడిమీద ద్వేషభావం పెరగలేదు పైగా వాడి మాటంటే కొంచెం గౌరవం పెరిగింది తనలో అందుకే రమేష్ తన ఇంటికి రాగలుగుతున్నాడు తనతో ఇలా మాట్లాడగలుగుతున్నాడు

''అలాగే రమేష్'' అంటూ ఆ వ్యవహారంలో తను చేయవలసిన సహాయం చేసిపెడతాను అని మాట ఇచ్చాడు సుబ్బరామయ్య

రమేష్ కృతజ్ఞతగా చూసి బయటికి వెళ్ళాడు, ఆ గదిలోంచీ

సుమ అప్పుడు ఇంట్లోనే ఉంది వీడు దాని దగ్గరికే వెళ్తున్నాడేమో — అసలు వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకుంటారో వినాలని తనూ గదిలోంచి

అప్పుడే వీధి మొత్త దగ్గర రామనాథం కనిపించాడు

అతణ్ణి చూసిన సుబ్బరామయ్య వదనం ప్రఫుల్లమైంది

ఆనాడు రామనాథం వచ్చివెళ్లిన దగ్గర్నుంచీ సుబ్బరామయ్య — అతడు పంపుతానన్న ఆ యువకుని కోసమే ఎదురు చూస్తున్నాడు సుజాత భవిష్యత్తు ఎంత తొందరగా తేలిపోతే అంత మంచిది అని తహ తహ లాడుతున్నాడు అలాగే ఇపుడు రామనాథం వచ్చాడు విషయమేమిటో తేలిపోతుంది

''రారా, రామనాథం! నీ కోసమే ఎదురు చూస్తున్నాను'' అన్నాడు సుబ్బరామయ్య

''నా ఒక్కడి కోసమే ఎదురు చూస్తూ కూర్చున్నావన్న మాట!'' అంటూ తన మిత్రుడికి దగ్గరిగా వచ్చాడు రామనాథం

''కాదులేరా '' అర్థోక్తంగా చూశాడు సుబ్బరామయ్య

''ఆ కుర్రవాడు ఒక్కడూ రావటానికి బిడియ పడ్డాడు సరేనని నేనూ బయలుదేరి వచ్చాను ఎలాగో మా అల్లుడి పని ఉందిగా వాళ్ళిద్దరూ వరండాలో నిలబడిఉన్నారు ''

''అయితే, అన్ని విషయాలూ అతడికి చెప్పావా ?''

''అన్నీ చెప్పాను సరే అన్నాడు ఆ బి ఎ పూర్తయి తనకేదో ఒక బ్రతుకు తెరువు దొరకటం ముఖ్యమన్నాడు ''

''వాళ్ళను అక్కడే నిలబెట్టి ఉంచావేం ? లోపలికి పిలు ' అన్నాడు సుబ్బరామయ్య అతడి మనసు ఏమిటో తీయటి అనుభూతులతో నిండిపోతోంది

రామనాథం వెళి వాళ్ళను తీసుకువచ్చాడు

ఇద్దరూ వచ్చి నమస్కారం చేశారు సుబ్బరామయ్యకు ప్రతినమస్కారం చేశాడు అతడు

''ఇతడే మా అల్లుడు పేరు కృష్ణ ఇతడు విశ్వం''— వాళ్ళిద్దర్నీ పరిచయం చేశాడు రామనాథం

సుబ్బరామయ్య దృష్టి విశ్వం మీదే ఎక్కువ సేపు నిలిచింది

## కాలమిచ్చిన తీర్పు

అతణ్ణి చూసి సంతృప్తిని వ్యక్తంచేశాడు సుబ్బరామయ్య

హాలులో కొత్త వ్యక్తులను చూసి అక్కడికి వచ్చింది సుందరి లోపలినుంచి

రామనాథం వచ్చివెళ్లిన రాత్రి అతడు తనతో చెప్పిన సంగతి సుందరికీ చెప్పాడు సుబ్బరామయ్య 'ఏదో యీవిధంగానైనా దాని జీవితం ఒక ఒడ్డున పడితే ఈ జన్మకు ధన్యులమేనండీ మనం' అని ఆమె అనుకూడా అంది భర్తతో

ఇక — తల్లిదండ్రులు మాట్లాడుకున్న ఆ మాటలు సుజాతా విన్నది చాటుగా తన జీవితంలో ప్రవేశించబోయే కొత్త వ్యక్తి రూపాన్ని పదే పదే ఊహించుకొంటూ బ్రతుకుమీద ఎన్నో ఆశలు పెంచుకొని కొంత ఉత్సాహంగానే వుంటోంది ఆనాటినుంచీ

''సుందరీ! రామనాథం వచ్చాడు ఇతడు వాళ్ళ అల్లుడు కృష్ణ యీ కుర్రవాడి పేరు విశ్వం '' అంటూ వాళ్లను పరిచయం చేశాడు సుబ్బరామయ్య

''ఓహో'' అంటూ సుందరి — ముఖ్యంగా విశ్వాన్నే పరిశీలనగా చూసింది

వాళ్లిద్దరూ ఆమెకుకూడా నమస్కారం చేశారు ఆమె ప్రతి నమస్కారం చేసింది తర్వాత,

''కూర్చోండి '' అని అందరికీ చెప్పి తన ఏర్పాట్లేమో తాను చెయ్యటానికిగామాలు తిరిగి లోపలికి వెళ్లింది సుందరి

రామనాదం, సుబ్బరామయ్య ప్రక్కప్రక్కగా కుర్చీల్లో కూర్చున్నారు కృష్ణ, విశ్వం తమ కుర్చీలను వెడంగా జరుపుకొని ప్రక్కగా కూర్చున్నారు

ఇంతలో అక్కడికి రమేష్, అతని వెనుక సుమ వచ్చారు

రమేష్ వాళ్ళవైపు అదోలా చూస్తూ బొమ్మలా ఒకచోట నిలబడిపోయాడు

సుమ నిర్భయంగా వెళ్లి, ''వీరు ఎవరు నాన్నగారూ ?'' అని అక్కడే అడిగేసింది తండ్రిని

ఆమెది అదోరకం తత్వం ఆడ, మగ—పెద్ద, చిన్న విచక్షణ లేకుండా అందరితో చొరవగా మాట్లాడుతుంది చనువుగా వుంటుంది సుమ తనతో మాట్లాడుతోంది మనసులో యిష్టం లేకపోతే దూరంగానే వుండేదిగా తనకు లోలోపల తనని చేసుకోవాలని వుంది కనుకే చనువుగా వుంటోంది తనతో — యిలా అభిప్రాయపడే ఆమెను తరచు కలుసుకొనే ప్రయత్నం చేస్తున్నాడు రమేష్

'ఈయన పేరు రామనాథం అమ్మా! నా బాల్యమిత్రుడు మొన్న ఒకసారి మనింటికి వచ్చి వెళ్ళాడు గుర్తులేదూ ?''

''ఓహో! మీరా మామయ్యగారూ!'' అంది సుమ

మిగతా ఇద్దరూ కూడా పరిచయం అయ్యారు ఆమెకు

కొద్దిసేపు — ముఖ్యంగా సుబ్బరామయ్య, రావ

ఈలోగా ట్రేలో కాఫీ తీసుకువచ్చింది సుజాత ఒప్పుడామె ముఖం సిగ్గుతో కుంచించుకుపోతోంది సంతోషపారవశ్యం అన్నట్లు మధ్య మధ్య ఆమె కాళ్ళు చేతులు వణుకుతున్నాయి

సుబ్బరామయ్య సౌంజ్ఞ చేయటంతో అక్కడే వున్న సుమ తన అక్క చేతుల్లో వున్న ట్రేలోంచి ఒక్కొక్క కప్పే తీసి అందరికీ యిచ్చింది

"ఇక నువ్వు వెళ్లమ్మా!" అన్నాడు సుబ్బరామయ్య సుజాతతో తండ్రి ఆ మాట అన్నదే తడవు వెనక్కుతిరిగి చూడకుండా త్వర త్వరగా లోపలికి వెళ్లిపోయింది ఆమె

"చూశావా విశ్వం, అమ్మాయిని ?" రామనాథం నలుగురిముందే అడిగేశాడు అతణ్ణి

"చూ శా నం డీ!" అన్నాడు విశ్వం తొణకకుండా

"అయితే యిపుడేమంటావ్ ?"

"ఎప్పుడూ నామాట ఒకటే"

"అన్ని విషయాలూ వేరు ఇది వేరుకద ?" అన్నాడు సుబ్బరామయ్య

"మీమాట నిజమే సర్! నేను ఒప్పుకుంటాను అయితే యీ లోకంలో చాలామంది మనస్తత్వాలకు భిన్నమైనది నా మనస్తత్వం అలా అని నేను అనుకోవటంకాదు చిన్నప్పటినుంచీ చాలామంది అనటం నన్ను గురించి ఆలోచించుకొంటె నాకూ అలాగే అనిపిస్తుంది ఆనాడు రామనాథం మాష్టరు మిమ్మల్ని గురించీ, మీ అమ్మాయి — ఆమె అందచందాలను గురించీ పూసగుచ్చినట్లు చెప్పారు మాష్టారు చెప్పిన మీ అమ్మాయి రూపురేఖలు నా మనసులో వెంటనే నాటుకుపోయాయి అప్పుడే ఒక ఊహా చిత్రం నా కళ్లముందు నిలిచింది అయినా నేను మాష్టారి మాటలకు తలవొగ్గాను"

ఆ మాటలు విని విశ్వానిది ఎంతో గొప్ప మనస్సుగా తోచింది సుబ్బరామయ్యకు అయినా తను బయటపడకుండా అతడి గుండె లోతును గురించి మరికొంత తెలుసుకోవాలని అడిగాడు

"నీకు బ్రతుకుతెరువు ముఖ్యమటగ ? రామనాథం చెప్పాడు ఉద్యోగపు తొందరకొద్దీ నీవిలాంటి నిర్ణయానికి వచ్చివుండవచ్చుగా ?"

'సరైన ప్రశ్న అడిగావురా' అన్నట్లు సుబ్బరామయ్య వైపు చూశాడు రామనాథం

"నిజమే నాకు ఉద్యోగం ముఖ్యమే సర్! బ్రతుకుతెరువుకోసం — ఉద్యోగ ధర్మంగా శరీరాన్ని అమ్ముకొంటే అమ్ముకోవచ్చును కానీ, స్వలాభం కోసం మనసును అమ్ముకోలేనండీ!" ఆమాటలు అంటున్నప్పుడు విశ్వం కంఠం కొంచెం బాధగా ధ్వనించింది

'చూశావా ? — నేను చెప్పలేదూ అతడిది ఎంతో విశాలహృదయమని ?' అన్నట్లు మరోమారు సుబ్బరామయ్య వైపు చూశాడు రామనాథం

"సరే, మిస్టర్ విశ్వం! నిన్ను నేను నమ్ముతున్నాను అలాగే నన్ను నువ్వూ విశ్వసించాలి మనిద్దరి నమ్మకాలు కలకాలం నిలవాలి అదే నా హృదయపూర్వకపు ఆకాంక్ష" అన్నాడు సుబ్బరామయ్య చివరకు

ఇంతసేపూ వాళ్ళు మాట్లాడుకొనే మాటలు కొంత అర్ధమైన — అసలు విషయం బోధపడలేదు సుమకు అందుకే అడిగింది

"ఏమిటి నాన్నగారూ యిదంతా ?"

"అంతా ముందు ముందు నీకే అర్థం అవుతుందిలే సుమా! విశ్వం ఇకనుంచ మన ఇంట్లోనే వుంటాడు మనమంగరం అతడితో సహకరించాలి" అన్నాడు సుబ్బరామయ్య

ఇక అక్కడి పరిస్థితినిబట్టి రమేష్ తేలిగ్గానే గ్రహించుకున్నాడు, ఆ విశ్వం సుజాతకు కాబోయే భర్త అనీ, మామయ్య వాళ్లింట్లోనే అతడు తిష్ఠ వెయ్యబోతున్నాడనీ

ఆ తర్వాత తనకు పని వుందని రమేష్ వెళ్లిపోయాడు అతడెవరో అక్కడివాళ్లందరికీ తెలియ చెప్పాడు సుబ్బరామయ్య

ఖాళీ కప్పులను తీసుకొని సుమ లోపలికి వెళ్లింది

విశ్వం వుండటం, తినటం — ఆ విషయాలు మాట్లాడాడు రామనాథం

ఇకనుంచి అవన్నీ తన ఇంట్లోనే— ఏర్పాట్లు చేస్తానన్నాడు

కృష్ణ ఉద్యోగ విషయం వచ్చి — ఒక

(30వ పేజీ చూడండి)




# అర్ధాంగుల ఆర్థిక సూత్రాలు!

### ఉపోద్ఘాతం

నా కెన్నాళ్లనుంచో మా ఆవిడ అద్వితీయమైన మనిషన్న అభిప్రాయం ఉంది దానికి కారణం ఆర్థిక విషయంలో మా ఆవిడ కొన్ని సూత్రాల్ని అనుసరించి ప్రవర్తిస్తుంది ఆ విధంగా మరెవరి భార్యలు ప్రవర్తించరని అనుకొన్నాను మా ఆవిడ ప్రవర్తను పన్నెండేళ్లపాటు గమనించి ఆరు సూత్రాలు రూపొందించాను అవి గత సంవత్సరం బెంగుళూరులోని రాజాజీ నగరపు తెలుగు సమితి సభ్యులముందు, ఎన్ ఏ ఎల్ తెలుగు సాంస్కృతిక సమితి సభ్యుల ముందు ఉంచాను అందులో భార్యలు కలవారు కొందరు "యురేకా! మా, మా, ఆవిడలు అనుసరిస్తూ వచ్చిన, మాకు అర్థం కాకపోతూ వచ్చిన, ఆర్థిక సూత్రాలు ఇవే! ఇకముందు మా, మా భార్యల్ని అపార్థం చేసుకోమని, ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరానికి ఉడతాభక్తిగా, ప్రమాణం చేస్తున్నాం" అన్నారు ముందుకు వచ్చి మా ఆవిడ ఆర్థిక విషయాలలో అద్వితీయురాలు కాదన్న విషయం నాకు ఆశాభంగం కలిగించింది

కాని ఇంతలో ఓ చిన్న ఆశాకిరణం కనిపించింది నేనీ సూత్రాల్ని తొందరగా బహుళ ప్రాచుర్యం కలిగిన ఏ పత్రికలోనైనా ప్రచురిస్తే (ఈ ఎలుకల పరుగు పందాల రోజుల్లో ఏ పార్కిన్సన్నో నాకంటే ముందే ప్రచురించకుండా) న్యూటన్ సూత్రాలకి కారణభూతమైన ఆపిల్ పండుకి చిరస్థాయిగా కలిగిన గౌరవం అయినా మా ఆవిడకు కలుగుతుందని తోచింది

### మొదటి సూత్రం

బాగుపడాలంటే బంగారం కొనాలి!

బంగరం గురించి మాట్లాడే ముందర మీకు అర్థంకావాల్సిన పదజాలం చాలా వుంటుంది తులం, కాసు, చిన్నం, ధర్మకాటా, తరుగు, టంకం వగైరాలు మీరు బాగా తికమకపడి "కాసు కెన్ని గ్రాములు?" అని అడుగుతారు "తులానికి ఒకటిన్నర కాసులు" అంటుంది మీఆవిడ మీ కర్థంకాకపోతే ఎవరిది తప్పు? చిన్నప్పుడు మీకు లెక్కల్నేర్పిన మేష్టారిది!

ఉదాహరణకి ఆరు సంవత్సరాల క్రితం జరిగిన విషయం మీకు గుర్తుకుతెస్తే ఈ మొదటి సూత్రం మీ కర్థమౌతుంది అప్పుడు మీఆవిడ దగ్గర అడపాతడపా పుట్టింటివారిచ్చిన డబ్బు నాలుగువందలయాభై వుంది ఆరోజుల్లో కాసు నూటయాభై రూపాయలు మీరు "ఆ డబ్బు ఫిక్సెడ్ డిపాజిట్‌లో పడేస్తాను" అంటారు దానికి మీఆవిడ "ఈ రోజుల్లో డబ్బుకి విలువేం వుంది మూడు కాసులు పెట్టి ఓ జత గాజులు చేయించుకొంటాను పెద్దపిల్ల పెళ్లి కెదిగేసరికి ఇంట్లో కొంత బంగారం వుండటం మంచిది" అంటుంది ఇద్దరు బంగారం కొట్టుకు వెళ్తారు అక్కడ మీఆవిడ కటింగ్ గాజులు చెయ్యమని వాళ్లకి పురమాయిస్తుంది తయారైన గాజులు మూడు కాసులుండాలంటే తరుగు ఓ యాభై రూపాయలు, మజూరీ ఓ యాభై రూపాయలు కావాలంటాడా పెద్దమనిషి

"చిట్టీ! ఆ నూరు ఎక్కడని?" అని మీరడగరు పిల్లలకి గుడ్డలు మీ అత్తవారిస్తే కుట్టుకూలి ఎవరిస్తున్నారు? మీరే! మీరున్నదే అందుకు ఆ విషయం పెళ్లయిన రెండు మూడేళ్లలోనే మీ కర్థమయివుంటుంది

ఆ కొట్టుచుట్టూ తిరగటానికి ఓ యిరవై రూపాయలదాకా తిరుగుడు ఖర్చుపెట్టాక అన్ని ఖర్చులు వెరసి 570 రూపాయలకి ఆ జత గాజులు మీ యింటికి చేర్తాయి

మీఆవిడ ఆ గాజుల్ని మీ పక్కింటి వనజగారికి చూపిస్తుంది ఆవిడ "మీవారు చేయించారా?" అని అడగడం మీకు వినిపిస్తుంది "అంత భాగ్యం కూడాను నా వంటిమీద, నా పిల్లల వంటిమీద వున్న బంగారమంతా మా పుట్టింటివారు పెట్టిందే" అని మీఆవిడ నిట్టూరుస్తుంది

కాలగర్భంలో మూడు సంవత్సరాలు గడిచిపోతాయి మీ పక్కింటి వనజగారు మిరియాల గాజులు చేయించుకొని మెరిసిపోతూ వుంటుంది ఆమాట మీరనరు అంటే బతకరు మీ ఆవిడే అంటుంది తరవాత తనుకూడా అల్లా మెరిసిపోవాలన్న కోర్కె వెలిబుచ్చి, అప్పైన పాత గాజులు చెరిపించి మిరియాల గాజులు చేయించుకొంటుంది

ఈసారి తరుగు మజూరి కలిసి నూటయాభై రూపాయలవుతుంది తిరుగుడు ఖర్చు మరో పాతికా ఇవన్నీ కలిసి మొత్తం 745 రూపాయలవుతుంది

మరో మూడు సంవత్సరాలు గి్రున తిరుగుతాయి బంగారం ఖరీదు పెరిగి కాసు మూడు వందలవుతుంది "నే చెప్పలేదూ! ఈ మూడు కాసుల గాజులు ఇప్పుడు తొమ్మిది వందలు చేస్తాయి" అంటుంది, ఆవిడ కాని నిజానికి ఆ గాజులు అరిగి తూస్తే మూడు కాసులుండవు అవి అమ్మితే 800 రూపాయల కంటే రావు ఆ మాటే మీరంటే "450 రూపాయలు పెట్టిన బంగారం 800 చేస్తోందంటే ఏమిటి? బంగారం మీద పెట్టిన ఖర్చుకి ఢోకా లేదని ఇష్టం కావడం లేదూ" అని ఆవిడ అంటుంది

మీరు ఫిక్సెడ్ డిపాజిట్‌తో అరేళ్ల క్రితం 570 రూపాయలు, మూడళ్ల క్రతం 175 రూ వేసిఉంటే మొత్తం 275 రూ అయినా వడ్డీ వచ్చి ఉండేదీపాటికి అని లెక్కలు కడ్తారుత్త కాబూలీవాళ్లలాగా నిజం చెప్పండి ఆవిడ ఆ గాజులు వేసుకొని మెరిసిపోతుంటే చూసి మీరు ఆనందించలేరూ! దాని విలువకూడా ఫిక్సెడ్ డిపాజిట్‌తో వేసి చూడండి అప్పుడు త్రాసు ఆవిడవేపే మొగ్గుతుంది

### రెండో సూత్రం

పుట్టింటివారిచ్చిన సొమ్ము తరగదు!

మీరు, మీ ఆవిడ మీ అత్తవారి ఊరు వెళ్లినప్పుడు మీ మావగారు బట్టలు పెట్టకుండా,



మీ ఆవిడ చేతిలో ఓ మూడు వందలు పెడ్తారు మొగవాళ్లందరికీ ఉన్న బలహీనతే మీకూ ఉంది ''చూడు చిట్టీ ! ఆ డబ్బు నా చేతికియ్యి మనూరు వెళ్లగానే ఇస్తాను'' అంటారు ప్రయాణాల్లో ఎంత డబ్బూ చాలదుమరి ఆవిడ ఇస్తారు మీ అత్త వారి ఊళ్లో, మీ ఊళ్లో దొరకని చీరలు దొరుకుతాయి అవి బావుంటాయికూడాను ముఖ్యంగా మీ ఆవిడకి అందుకని ''మావాళ్లిచ్చిన డబ్బు మీదగ్గరుంది కదా ! అందులో ఒక వంద ఇలా ఇవ్వండి ఓ చీర కొనుక్కుంటాను'' అంటుందావిడ ఆవిడ డబ్బు ఆవిడ కివ్వడానికి మీకేం బాధ అనిపించదు ఇస్తారు

మీరు మీ ఊరు తిరిగివచ్చిన కొద్ది రోజులకి మీ ఏ బాకీలు వస్తాయి ఆ సందర్భంలో మీరు మీ ఆవిడ కివ్వవలసిన బాకీ రెండు వందలే కాక మరో పాతిక కలిపి బహుమానం పేరుతో వడ్డీ చెల్లిస్తారు అసలు గొడవ అక్కడే వస్తుంది మీ ఆవిడ మీ ప్రేమాభిమానాల్ని అర్థం చేసుకోదు పైగా ''మీరింకా నాకో వంద ఇవ్వాలి !'' అంటుంది

మీరు ''నువ్వది అప్పుడే తీసుకొన్నావుగా'' అంటారు

''మీరు కొన్న చీరకూడా మా నాన్నగారి లెక్కలోనే వేస్తారా ?'' అని ఆవిడ అడుగుతుంది దాని అర్థం మీకింకా బోధపడలేదా ? చెప్తాను వినండి మీరు మీ ఆవిడ దగ్గర అప్పు చేసిన మూడు వందలలో ఒక వంద ఆవిడ చేతికిచ్చి చీర కొనుక్కోమనడం ద్వారా మీ విధి మీరు నిర్వర్తించారు అందుకే మిమ్మల్ని భర్తనీ, ఆవిడను భార్యనీ అన్నారు

ఆ విధంగా ఆవిడ పుట్టింటివారిచ్చిన డబ్బు మీ లెక్కల్నీ, బడ్జెట్‌ని తారుమారు చేస్తుంది కొన్నేళ్లపాటు ఆ డబ్బు రసాయినిక చర్యలో కెటలిస్టు లాంటిదని, అది క్రయం వల్ల ఖర్చు కాదని మీ రెప్పుడు గుర్తిస్తారో అప్పుడు ఆ మొత్తం మిమ్మల్నిబ్బంది పెట్టడం మానేస్తుంది

**మూడో సూత్రం**

వస్తువులు చవకగా అమ్మేచోట, అమ్మేటప్పుడు కొనుక్కోవాలి !

ఈ సూత్రం మీ కర్థమైనట్టే యుండి అర్థమవకుండును దానికి కారణం ఈ సూత్రాన్ని మీ ఆవిడ అమలులో పెట్టే విధానం దీనికి నాలుగు ఉదాహరణలు చెప్తాను

మీ ఊరి పెద్ద మార్కెట్టులో కూరలు చవకగా అమ్ముతారు మీ పక్కింటి వనజగారి భర్త ప్రతి వారం అక్కడే కూరలు కొని తీసుకొనివస్తాడు మీరు కొనరు ఎందుకు ? ఆయన బంగారు కొండ కనక, మీరు బడుద్దాయిలు కనక— ఏదో ఒకటి, లేక రెండూను ఒక రోజున మీరు మీ ఆవిడ పోరు భరించలేక మీ ఆవిడతో బజారుకి బయల్దేర్తారు మీరు సిటీబస్సులో వెళ్లి వచ్చేద్దామన్న ఉద్దేశంతో బస్సు స్టాపు వైపుకి నడుస్తారు మీ ఆవిడ ''చక్కగా రిక్షాలో (ఆటోలో) వెళ్దామండి అల్లా అయితే పని తొందరగాను పూర్తవుతుంది పైగా సరదాగా ఒకళ్ల నొకళ్లం అనుకుని కూర్చుని షికారు కొట్టినట్టవుతుంది ఈ మధ్య అల్లా తిరగ చూస్తుంది మీరు మంచులా కరిగి సరేనంటారు రెండ్రూపాయల ఖర్చుతో పెద్ద మార్కెట్టు చేరుకొంటారు

మీ ఆవిడ మీకు ఒక వారానికి సరిపడ్డ కూరలు కొంటుంది పది రూపాయలు పెట్టి మీరక్కడ కొన్న కూరలు మీ పేటలోనే కొంటే 12 రూపాయలు అయ్యేదని రెండ్రూపాయలు ఆదా అని మీ ఆవిడ సంబర పడుతుంటే, మీరు రిక్షాకి రెండ్రూపాయలైందని నడిచి ఇంటికి వెళ్లే పక్షంలో నష్టంగాని లాభం లేకుండా తునితగివు అవుతుందని అంటారు అక్కడే సరిగ్గా మీ ఆవిడకి మీరంటే వొళ్లు మండేది ! ఆవిడ వెంటనే మరో వారానికి సరిపడా కూరలు కొని, మరో రెండ్రూపాయలు ఆదా చేస్తుంది బరువుతో తిరిగి ఇంటికి వెళ్లేటప్పుడు రిక్షావాడు మరో అర్ధరూపాయి యెక్కువ కావాలని నిర్మొహమాటంగా అడిగి తీసుకొంటాడు మీ పేటలో అదే కూరలు కొంటే అదే డబ్బు ఖర్చయ్యేది ! మీరామాటే అంటారు ''అయితే పెద్ద మార్కెట్టులో మనం తీసుకొన్న కూరలు చాలా తాజాగా లేవూ !'' ఆవిడ మిమ్మల్ని నిలదీస్తారు మీరు పెద్ద మార్కెట్టులో కొన్న కూరలు రెండ వారాలపాటు తాజాగా ఉంటాయా ? అంటూ చొప్పదంటు ప్రశ్నలు వేస్తే మీ ఆవిడకే కాదు ఎవరి ఆవిడకైనా వళ్లు మండుతుంది

ఇంక మనలో కొందరికి ఘరానా ఉద్యోగాలుంటాయి వాటితోపాటు ఘరానా భార్యలు కూడా ఉంటారు మీ ఆవిడ, కాని ఖర్చు లేకుండా బలమైన ఆహారం వండటం గురించి వనితల పత్రికలో చదివింది అందులో చెప్పిన ప్రకారం మీ ఆవిడ మిమ్మల్ని కారు ఊరు బయటికి నడపమంటుంది అక్కడో చింతచెట్టు దగ్గర కారు మీచేత ఆపిస్తుంది మీచేత చింతచిగురు కోయిస్తుంది ఆవిడ చింత అంటారా ? వాడారేకాని ప్రత్యేకించి చింతచిగురు కోసం పోయించలేదుకదా !

మూడో ఉదాహరణ ముచ్చటైనది బాంబేలో బాంబే డైయింగ్, అహ్మదాబాద్‌లో కాలిసింథ్, లక్నోలో హకోబా, ధర్మవరంలో పట్టు, బందారు లంకలో చేనేతవి, చీరలు చవకగా అమ్ముతారు (ప్రతి ఊరుకి చీరల విషయంలో ఏదో ఒక ప్రత్యేకత ఉంటుందని మీ నమ్మకం అంటారా ? అనండి పోయిందేమీలేదు ) అందుకని మీ పక్కింటి వనజగారు ఆ వూర్లు వెళ్లినప్పుడల్లా, మీకాదా చేసిపెద్దామన్న సదుద్దేశంతో మీ ఆవిడ వనజగారి ద్వారా మూడేసి చీరలు తెప్పించుకొంటుంది ఆ చీరలకి, మీ ఊళ్లో ఖరీదెక్కువ అసలు ఊళ్లో కొంటే లాభం ఎక్కువ చీరలు తెప్పించుకొంటే ఇంకా ఎక్కువ లాభం !

కాని ఇవేమీ మీరు అర్థం చేసుకోరు మీరో బుద్ధావతారం అందుకని ''అసలు చీరలే కొనకపోతే అంతా లాభమే కదా!'' అని సణుగుతారు ఆవిడ దాంతో ''తెల్లచీర కట్టిన దెవరికోసం ?'' అనో ''నే నందంగా ఉండటం ఎవరికోసం? ఎవరికోసం?'' అనో ఓ పాట విషాదంగా ఆలపిస్తుంది

దానికి మీరు పల్లీ కొట్టకపోతే మీరు కారణ జన్మలో, లేక పూర్వజన్మలో మీరు రాయో రప్పో !

ఇంకా ఈ మూడో సూత్రం అర్థం కాలేదా ? అయితే మరో ఉదాహరణం చెప్తాను వినండి ప్లాస్టిక్ బకెట్ కొన్నవాళ్లకి సబ్బుబిళ్ల ఒకటి ఉత్తినే ఇస్తానంటాడో డీలరు అతి పొదుపరైన మీ ఆవిడ ఆ అవకాశం పోగొట్టుకోడం ఇష్టంలేక ఆ బకెట్ కొంటుంది మీ రావిడ ఉద్దేశం అర్థం చేసుకోకుండా పెద్ద రాద్ధాంతం చేస్తారు ఏమన్నా బాగుందా మీ ప్రవర్తన ?

(ఇంకా వుంది)






# జయాన్ని చవిచూస్తున్న ప్రద!



అభినేత్రి జయప్రద

ప్రేక్షక మహాశయులకు శతకోటి నమస్కారాలు అంది బంగారు చిలక ఉగాదికి ఇంటర్వ్యూ కావాలని వెళ్ళినప్పుడు

దర్శకుడు తిలక్‌గారి భూమికోసం చిత్రంలో తళుక్కుమని మెరిసిన బంగారుబొమ్మే నేటి జయప్రద

ఈమధ్య విడుదలయిన అంతులేని కథ చిత్రం జయప్రదను ఒక చక్కటి ఆర్టిస్టుగా ప్రజలకు ఆత్మీయురాలుని చేసింది

రోజూ ఆమెకు వచ్చే ఉత్తరాలు వందను దాటుతున్న విజాన్ని నేను చూశాను

### ఉత్తరాల వ్యత్యాసం

అక్కయ్యా అని ఆప్యాయంగా సంబోధించే తమ్ముళ్ళు కొందరయితే కొంటెగా కోరికలను వ్యక్తపరిచే వ్యక్తులు మరికొందరయితే ఆశీర్వదిస్తూ రాసేవాళ్ళు యింకొందరుగా జయప్రదను అభినందనల వర్షంతో ముంచెత్తే విజాన్ని ఆమె చదువుతున్నప్పుడు కలిగే మధురానుభూతి వర్ణనాతీతం

### తీరిన కోరిక

నేను అగ్ర దర్శకుల వద్ద పని చెయ్యగలవా అని సంశయించిన రోజున నా ఆత్మ చెయ్యగలవు అని హామీ యిచ్చింది నా కోరిక తీరినందుకు ఎంతో ఆనందిస్తున్నాను అంది జయప్రద

అగ్రశ్రేణి దర్శకులు విశ్వనాథ్ దాసరి నారాయణరావు బాపు మధుసూదనరావుగార్లు తనకు వైవిధ్యం వున్న వేషాలు యిచ్చి తనచేత చేయిస్తున్నారు గాబట్టే ప్రేక్షకులు అభినందిస్తున్నారు అనేది నిజాన్ని అంగీకరించడంలో జయప్రద జంకడంలేదు.

### కృతజ్ఞతలు !

దర్శకుడు తిలక్‌గారికి నటుడు ప్రభాకరరెడ్డిగారికి తన కోరికను మన్నించిన తండ్రిగారికి కృతజ్ఞతలు తెలపడం తన మొదటి ధర్మంగా భావిస్తున్నది జయాన్ని చవిచూస్తున్న ప్రద

### కన్నీటి కథ !

ఇంత ఆనందమయ జీవితాన్ని ప్రసాదించి దేవుడు కన్నీటి కథను శాపంగా యిచ్చాడు జన్మనిచ్చిన తల్లిని లేనిది అయిన జయప్రదది కన్నీటి కథ కాదా?

### నటిస్తున్న చిత్రాలు !

ప్రస్తుతం ఎన్ని చిత్రాల్లో నటిస్తున్నారు అని నేనడిగిన ప్రశ్నకు జయప్రద ఇచ్చిన సమాధానం యిది నటిస్తున్న అన్ని చిత్రాల్లో నాకు వెరైటీ వేషాలు దొరకడం ఊహించని అదృష్టం అంది

విశ్వనాథ్‌గారి మాంగల్యానికి మరో ముడి బాపుగారి సీతా కళ్యాణం, దాసరిగారి ఏకలవ్య మధుసూదనరావుగారి మిస్టర్. సంపత్ ఎం. ఏ. చిత్రాలలోని భిన్నమైన పాత్రలకు, గీతా కృష్ణా కంబైన్స్ వారి చిత్రం, ఆర్. కె. ఆర్ట్స్ వారి మన వూరి కథ, డి. వి. ఎస్. రాజుగారి చిత్రంలోని పాత్రలకు వున్న వ్యత్యాసం తనకు బంగారు బాటను ఏర్పరచగలదన్న నమ్మకం జయప్రదకు వుండడ న్యాయమే, మరి.

### ఇంట గెలిచి...

పరభాషా చిత్రాల్లో అంటె ... (తమిళ, హిందీ భాషల్లో) మిమ్మల్ని నటించమని వస్తున్న అవకాశాలకు మీరిచ్చే సమాధానం ఏమిటి జయప్రదను ప్రశ్నించాను

ఇంట గెలిచిన తరువాత తరువాత తతిమ్మావాటి గూర్చి ఆలోచించడ మంచిదేమో అంది

నటసమ్రాట్ గారితో ఏదేని చిత్ర నటిస్తున్నారా ?

ఆ మహానటుడు నటించిన చిత్రాల ఎంతో ఆసక్తితో చూచే నాకు ఆయన సరసన నటించాలని వుండదా ? అవకాశం వచ్చే రోజు దగ్గర్లోనే వుందని నా మనసు చెపుతూంది అంది అందాల అతివ మాయావిలో హలం ఫోటో కింద జయప్రద



మాయావిలో హలం

* * *

## 2 వేల కచేరీలు చేసిన విజయ

లలిత సంగీతంలో శ్రద్ధ వహించి సాగర్ ఎలిపి ప్రావీణ్యతను సంపాదించిన విజయను ఎవిమా ర గం సద్వినియోగపర్చుకుంటున్నది

విఖ్యాత తిరుపతి వెంకటకవులలో ఒకరయిన దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు యీమెకు తాతగారు ఈమె వివాహం మచిలీపట్నం చిన్న వయస్సునుండే సంగీత కచేరీలు ఒరిపి జనామోదం పొందింది కర్ణాటక సంగీతంలో డిప్లొమా సాధించింది ఈమెకు పాఠాలు నేర్పిన గురువులు 1 శిష్ట్లు బ్రహ్మయ్యగారు 2 మునర్ల శివరాంగారు

తను నేర్చిన విద్యను లక్షలాది శ్రోతలకు కచేరీల ద్వారా వినిపించి ఆశీస్సులను పొందింది కర్ణాటక లలిత సంగీతంలో సమపుజ్జీగా అందరినీ ఆకర్షించింది

1967 – 75 అంటె తొమ్మిది సంవత్సరాలు హైద్రాబాద్ ఫిల్మ్ టాలెంట్స్ అండ్ గిల్డు సంస్థ ద్వారా ఆలిండియా రేడియో ముఖంగా జానపద లలిత సంగీతాన్ని ప్రచారం చేసిందీవిడ

ఈమె వాయిస్‌లోని తియ్యదనాన్ని ప్రముఖ సంగీత దర్శకులు పెండ్యాల రాజేశ్వరరావు మహదేవన్‌గార్లు మెచ్చి చిత్రాలలో పాడే అవకాశాన్ని యిచ్చారు యిస్తున్నారు

యశోదా కృష్ణ కొల్లేటి కాపురం ప్రేమాయణం చిత్రాలలో విజయ తన గాన సరస్వతిని చవిచూపింది

ఈమధ్య యీమె సుశీల కలిసి పాడిన జంట గీతాన్ని ప్రసాద్ థియేటర్లో విన్నాను నే విన్న పాట శీలానికి శిక్ష చిత్రంలోనిది మహదేవన్ సంగీత దర్శకుడు

చెప్పకపోతే ఒట్టు
మిమ్మల్ని చంపుకుతిన్నట్టు అనేది పాటను విజయ బలేగా పాడింది

ఈమెకు వుజ్వల భవిష్యత్తు వుండగలదన్న నమ్మకాన్ని మహదేవన్ పెండ్యాల రాజేశ్వరరావు



అదృష్టవంతురాలు లో ఉదయ చంద్రిక జానకి

## రాజబాబు ఖుర్రంతా ఆలోచనలే !

హాస్యరాజు కు తీరిక దొరికితె చాలు మనిషి జీవితాన్ని గూర్చి ఆలోచిస్తూ వుంటారు రేకెత్తే ఆలోచనలను ఎరా చెయ్యడం అతగాడికి అలవాటు లట్టి ఆలోచనల పుట్టనుంచి పుట్టిన పెండే మనిషి రోడ్డున ఎడ్డాడు

బాబ్ అండ్ బాబ్ క్రియేషన్స్ నిర్మిస్తున్న యీ చిత్ర షూటింగు భాగ్యనగరంలో మే 15 న ప్రారంభమవుతుంది ఈ చిత్రం తాలుకు మొదటి పాట రికార్డింగ్ మార్చి మూడున జరిగింది ఆచార్య ఆత్రేయ రాసిన

దూరం దూరం ఎంత దూరం
ఇంకెంత దూరం
వేగ వేగం ఎంత వేగ
ఇంకెంత వేగం

పాటను ఆనంద్ సుశీల పాడారు అందరినీ ఆకర్షించే పాట కాగల శక్తి దూరం వేగం కు వుంది

తమిళ చిత్ర రంగ లో సెహభాష్ అనిపించు కుంటున్న శంకర్ గణేష్‌గార్ల ప్రతిభను తెలుగు ప్రేక్షకులకు చవిచూపించే బాధ్యతను రాజబాబు తీసుకుని తన చిత్రానికి సంగీత దర్శకత్వం అప్పగించారు

కథను గూర్చి క్లుప్తంగా చెప్పారు రాజబాబు నిత్యజీవితంలో తారసపడే సజీవ పాత్రల రూప కల్పన సారమే మనిషి రోడ్డున ఎడ్డాడు అనిపించింది

## మరొక జయ !

మనకు మరో జయను పరిచయం చేస్తున్నారు రాజబాబు పేరు జయశుభ అమాయకత్వంలో అనూహ్యమైన అందాన్ని జయశుభ వరంగా బడసియుంది

ముఖ్య పాత్రలను సత్యనారాయణ ప్రభాకర రెడ్డి రావు గోపాలరావు నాగభూషణం రావి కొండలరావు నిర్మల రాధాకుమారి కృష్ణకుమారి చిట్టిబాబు కాకరాల తారాకృష్ణ పోషిస్తున్నారు కథను రాజబాబు మాటలను భమిడిపాటి ఛాయను మధు నిర్వహిస్తున్నారు

## రాజబాబు చేసిన మంచి పని

అన్నిటికంటె రాజబాబు అభినందనీయమైన పని ఒకటి చేశారు దర్శకుని ఎంపిక అనుభవజ్ఞుడు వివేకవంతుడు ప్రతిభావంతుడు అగు ఎ వి రమణ్‌జీకి దర్శకత్వ యివ్వడం ముదావహం

హాస్యరాజు సమర్పించు లక్ష్మి అమ్మలు నిర్మించు మనిషి రోడ్డున పడ్డాడు చిత్రం అన్నపూర్ణా ద్వారా విడుదలవుతుంది మంచిని పెంచే మనిషి రాజబాబును మంచి మనసున్న ప్రేక్షకులు ఆదరిస్తారు ఆశీర్వదిస్తారు



మనుషుల్లో దేవుడు లో కృష్ణ

## సీతమ్మ సంతానం !

ఫిబ్రవరి యిరవై అయిదున మురళీకృష్ణ ఎంటర్‌ప్రైజస్ వారి సీతమ్మ సంతాన ప్రారంభమైంది ఆత్మీయులు ఆప్తులు శ్రేయోభిలాషులు పాల్గొని దర్శకుడు కె ఎస్ రెడ్డిని ఆశీర్వదించారు

మొదటి షాటులో రోజారమణి పాల్గొన కె ఎస్ రెడ్డి డైరెక్ట్ చేశారు

ఏడుకొండలవాడా వెంకటరమణా బావ ఒట్టి అమాయకుడు ఆయన ఎక్కడున్నా కాపాడే భారం నీదే తండ్రీ అన్న డైలాగును రోజా చక్కగా పలికింది

## చలం ద్విపాత్రాభినయం !

కామెడీ హీరో చలం వైవిధ్యమున్న రెండు పాత్రలను సీతమ్మ సంతానం లో పోషిస్తున్నారు పల్లెటూరు పాత్రకు రోజా పట్నవాసం పాత్రకు జయసుధ జోడీగా నటిస్తున్నారు ఈ చిత్రానికి ఎనిసెట్టి కథ మాటలను సత్యనారాయణ ఛాయను సత్యం సంగీతాన్ని నిర్వహిస్తున్నారు

కరుణ హాస్య శృంగార రసభరితమైన సీతమ్మ సంతానం చిత్రాన్ని సర్వజనరంజకంగా రూపొందించగల ప్రజ్ఞ కె ఎస్ రెడ్డికి వుంది ఈ చిత్రానికి కె మురళి నిర్మాత ★



హీరో కృష్ణంరాజు

# కన్నప్ప ఉవాచ!

నిర్మల హృదయం, నిష్కల్మషమైన నవ్వులతో నిండిన నిండైన విగ్రహం హీరో కృష్ణంరాజు. సౌమ్య సంభాషణం, నిస్వార్థ సమాలోచనం అతని సుగుణాలు. వానిటీ (గర్వం) లేని వర్ధి ఆర్టిస్టు కృష్ణంరాజు, అనే పేరు సంపాయించుకున్నాడు. మాటకారి అని, అహంకారి అని కృష్ణంరాజును గూర్చి తెల్సిన వారెవ్వరూ అనరు. అతన్నిగూర్చి అంతగా తెలియనివాళ్లకు కూడా అతనిపై ఎలాంటి దురభిప్రాయం ఏర్పడదు. అలాంటి కృష్ణంరాజుతో ఉగాది శుభ సందర్భంగా ఓ ఇంటర్వ్యూ జరిపాను. అద్దాని సారాంశాన్ని ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

ప్రశ్న : "కృష్ణవేణి" లాంటి సాంఘిక చిత్రం తీసిన మీరు పురాణ సంబంధమైన "భక్త కన్నప్ప" చిత్రాన్ని నిర్మించడానికి గల కారణం ఏమిటి ?

జవాబు : మా స్వంత చిత్రాలలో ఏదో ఒక క్రొత్తదనం ప్రవేశ పెట్టాలన్నదే మా అభిమతం. అందుకే "కృష్ణవేణి" సాంఘిక చిత్రాన్ని మా మొదటి ప్రయోగంగా నిర్మించాము. ఆ చిత్రం కొన్ని తరగతుల ప్రేక్షకులకు మాత్రమే నచ్చింది. కనీసం మా ద్వితీయ ప్రయత్నంలోనైనా, అన్ని తరగతుల ప్రేక్షకులకు నచ్చే అంశాలను జొప్పించి, చిత్రం తీయాలనే తలపుతో కథావస్తువు కోసం ఆలోచించసాగాము. తిన్నని చరితం మా దృష్టి పథంలో మెరిసింది. "భక్తిరసం, కరుణరసం, శృంగారరసం, వీరరసం" మున్నగు నవ రసాలతో నిండిన ఈ కథను చిత్రంగా తీస్తే బాగుంటుం దనిపించింది. వెంటనే ఆ కథకు సంబంధించిన సంపూర్ణ వివరాలను సేకరించడం జరిగింది. సేకరణ ఫలితాలు సంతృప్తినిచ్చాక, నిర్మాణ కార్య క్రమంలోకి పురకడం జరిగింది.

# సినిమా

ప్రశ్న : "భక్త కన్నప్ప" చిత్రాన్ని అవుట్-డోర్‌లోనే నిర్మించడానికి గల కారణం ?

జవాబు : అవుట్‌డోర్ చిత్రీకరణ రెండు రకాలు. కాశ్మీర్, వూటీ, సిమ్లా లాంటి ప్రదేశాలకు వెళ్లి షూటింగ్ జరపడం ఒక రకం. ప్రకృతి ప్రసాదించిన మన చుట్టూ వున్న అందాన్ని మనకు కావలసిన రీతిలో వుపయోగించుకుని చిత్రీకరణ జరపడం రెండో రకం. మన జీవితాలకు దగ్గరగా, ప్రతిబింబాలుగా నిలిచే మనదైన సహజ సౌందర్యాల నడుమ చిత్రాన్ని తీయాలని, అలా చేయడంవల్ల నేటివిటీ ప్రతి కోణంలో కన్పిస్తుందని నా అభిప్రాయం. అందుకు ప్రత్యక్ష సాక్ష్యమే మా "కృష్ణవేణి" చిత్రం. మా కన్నప్ప చిత్రం కథావస్తువుకూడా అవుట్‌డోర్‌లో చిత్రీకరుంచుకోడానికి అనువైంది కాబట్టే, అవుట్‌డోర్‌లోనే నిర్మించాము.

ప్రశ్న : పురాణ చిత్రాన్ని అవుట్‌డోర్‌లో నిర్మించామన్న ఘనత దక్కింది. మీకు ఏమంటారు?

జవాబు : మెప్పుకోసం, గొప్పకోసం పని చేయడం నా కలవాటు లేదు. ఈ పని చేయడం సబబు అని తోచినపుడు, ఆత్మసంతృప్తి నిస్తుందనే నమ్మకం నాలో కల్గినపుడు కార్యరంగంలోకి దిగి, కార్యక్రమాన్ని కొనసాగించడం నాకు మొదటినుంచీ అలవాటు. అన్ని పురాణ చిత్రాలు అవుట్‌డోర్‌లో నిర్మించడమనేది జరగని పని. అలా వూహించడం కూడా తప్పే. "కన్నప్పలాంటి కథావస్తువు గల పురాణ చిత్రమైతేనే అవుట్‌డోర్ చిత్రీకరణ సాధ్యమౌతుంది. సెట్స్ వేసి నిర్మిస్తేగాని (స్టుడియోల్లో) వీలుపడని పురాణ చిత్రాల సంగతేమిటి ? ఎవ్వరూ చేయని పని మేము చేసాము అని గొప్పలు చెప్పకోవడంలో ప్రయోజనమేముంది. చిత్రాన్ని చూచిన ప్రేక్షకులు చెబితేనే అందముంది, అర్థముంది.

ప్రశ్న : "కన్నప్ప" చిత్రానికి మీరెన్నుకున్న ప్రదేశాలు ఏవి ? చిత్రాన్ని ఎలా తీశారు ?

జవాబు : ఆంధ్రదేశంలోని "బుట్టాయగూడెం" ప్రాంతాన్ని ముఖ్య కేంద్రంగా ఎంపిక చేసుకుని, ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలలో "కన్నప్ప" చిత్రాన్ని షూట్ చేసాం. షూటింగ్ నవంబర్‌లో అవగా, ఇక్కడినుండి కార్పెంటర్స్‌ను, పెయింటర్స్‌ను, మౌల్డర్స్‌ను రెండు నెలలు ముందుగా అక్కడికి తీసుకెళ్లి, చిత్రానికి వలసిన సెట్స్ నిర్మాణాన్ని పూర్తిచేసాము. డ్రీమ్ డాన్స్ చిత్రీకరణకోసం 38 క్రొత్త డ్రమ్స్ చేయించి, ఒక్కొక్కదానిపై ఇద్దరేసి చొప్పున నృత్యంచేసే దృశ్యాలను తీసాము. మంచి లైటింగ్ ఎఫెక్ట్‌కోసం గోదావరి ప్రాంతం నుంచి పవర్‌ఫుల్ లైట్స్ అమర్చివున్న వాన్స్‌ను ఎంతో శ్రమతో తీసుకొచ్చి, వాటి సాయంతో సాంకేతిక నిపుణుల సలహా, సహకారాలతో కొన్ని దృశ్యాలను షూట్ చేసాము. ఫైట్స్ (నాకూ— శ్రీధర్‌కూ మధ్య) చిత్రీకరణలో డూప్ లేకుండా కొన్ని గంటలు కష్టపడి సహజంగా

# * ఉగాదికి



ప్రశ్న : బాపు, రమణగార్లపై మీ అభిప్రాయం ?

జవాబు : ఇద్దరూ — ఇద్దరే. మేధావులు. మెథాడికల్ ప్లానింగ్ వున్నవారు. బాపుగారి దర్శకత్వం, రమణగారి రచనా కర్తృత్వం మా చిత్రానికి యస్సెట్స్ అనే నా అభిప్రాయం. అలాగే స్వామిగారు, భాస్కరరాజుగారు, తదితర సాంకేతిక నిపుణులు మా చిత్ర నిర్మాణంలో ఎంతో సహకరించారు. మా చిత్రంలో నటించిన వాణిశ్రీగారు, శ్రీధర్, రావుగోపాలరావు, ప్రభాకర రెడ్డి, బాలయ్య, సారధి, జయమాలిని, గిరిజారాణి,

'ముద్దబంతి పువ్వు'లో



## ఊర్వశి లేఖ *

''ఊర్వశి''ని ''ఉగాది''కి వ్యాసం యిస్తారా అని అడగడానికి, మార్చి అయిదున ఆవిడ యింటికి వెళ్లాను.

నే వెళ్లినప్పుడు, ఆమె యింట వందమంది ముత్తయిదువులు పూజలో నిమగ్నులై వున్న నిజాన్ని చూసి, ఏమిటి విశేషం అని అడిగాను, ఆఫీసు మేనేజర్ అమర్‌నాథ్‌ను.

– ''అష్ట లక్ష్మి వ్రతం'' అన్నాడాతడు. గంటన్నర పైగా పూజ జరిగింది. అతిథులందరూ ఫల పుష్ప తాంబూలాన్ని స్వీకరించి, శారదను దీవించి మరీ వెళ్లారు.

'ఉగాది'కి ఏదేని కొత్త విశేషాలు మీరు చెప్ప గలరా అని శారదను ప్రశ్నించాను.

తనకు అభిమానులు రాసే వుత్తరాలను నాకిస్తూ, వాటిని పాఠకులకు తెలపగలరా అంది.







పి. ఆర్. వరలక్ష్మి, ఝాన్సీగారలు కాల్‌షీట్స్ ఇవ్వడంలో తమ సంపూర్ణ సహకారాన్ని అందచేసి, అనుకున్నప్రకారం చిత్రాన్ని పూర్తిచేయడానికి దోహదం చేసారు వీరందరికీ నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

కృష్ణంరాజు అన్నట్లు ''భక్తకన్నప్ప'' చిత్రం అన్ని తరగతుల ప్రజలను ఆకర్షిస్తుందనడం నిర్వివాదాంశం. అతని చలనచిత్ర చరిత్రలో యిదొక మరపురాని సృష్టిగా నిల్చిపోతుందనడం నిస్సందేహం. ★

జయచిత్ర, మురళీమోహన్



## *** మాధవిగా మారిన విజయలక్ష్మి ***

మాధవిగా పేర్కొనబడుతున్న యీ అమ్మాయి అసలు పేరు విజయలక్ష్మి. సినిమాలు ఎక్కువగా చూసే అలవాటు పదవయేటనే ప్రారంభమైంది. దాసరి నారాయణరావుగారి చిత్రాలను పదే పదే చూస్తుందట. జీవితంలో జరిగే సంఘటనలను, సజీవంగా, సహజంగా చిత్రీకరించే దాసరిగారి చిత్రాలు తనకు ఎంతో యిష్టమట.

భగవంతు డిచ్చిన అందం, నేర్చుకున్న నటన సినిమారంగానికి పనికొస్తాయి అనేడి తన స్నేహితురాండ్ర మాటలు, విన్నప్పుడు అతిశయోక్తిగా అనిపించినా, నిజంగానే నటి కావాలన్న తాపత్రయం ఈమెకు లేకపోలేదు

ప్రముఖ నటుడు టి. ఎల్ కాంతారావుగారు యీ అమ్మాయిని ఎంపికచేసి, మదరాసుకు పిలిపించారు

మదరాసుకు వచ్చింది. తన అభిమాన దర్శకుడయిన దాసరిగారితో కాంతారావు ద్వారా పరిచయం ఏర్పరచుకుంది.

విజయభాస్కర్ ప్రొడక్షన్స్‌వారి ''పాడవోయి భారతీయుడా'' చిత్రం షూటింగును చూడడానికి వచ్చినప్పుడు, దాసరిగారితో పది నిమిషాలు పిచ్చాపాటీ జరిపింది.

### వేషం వేస్తావా ?

''అమ్మాయ్, నువ్వు సినిమాలో వేషం వేస్తావా'' అని దాసరిగారు ప్రశ్నించినప్పుడు, తను వింటున్నది నిజమేనా అని త్రుళ్ళిపడింది.

మరుదినం ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత రాఘవగారిని పిలిచి, యీ అమ్మాయికి మేకప్ టెస్ట్ చేయించమని దాసరి చెప్పడం, టెస్టులో యీ అమ్మాయి నెగ్గడం జరిగింది

ఒక పేజీ డైలాగు యిచ్చి టెస్ట్ చేశారు, గడుసరి. ఆ పరీక్షలోకూడా యీమె గెలిచింది.

'నువ్వు, రాఘవగారి ''తూర్పు...పడమర''లో నాయిక వేషం వేస్తున్నావ్' అన్నారు దాసరి.

### మాధవి !

ఇకపై నీ పేరు విజయలక్ష్మికాదు. ''మాధవి'' అన్నారు దర్శకుడు దాసరి.

పదహారు నిండని మాధవిని మూడేండ్లకు రాఘవగారు పర్మినెంట్ ఆర్టిస్టుగా బుక్ చేశారు.

విశాల నేత్రాలు, చక్కని పలువరుస, మంచి వాయిస్ వున్న ''మాధవి''కి మంచి దశ ఆరంభమయినట్టే.

తనకు యింతటి మహదవకాశాన్ని యిచ్చిన దాసరిగారికి కృతజ్ఞతలు తెలుపుతూ, నిర్మాత రాఘవగారికి వందనాలు వెల్లడించింది. ★

'శ్రీనివాసా ఏజన్సీస్'లో రికార్డింగ్‌లో బాలు, విజయ, రమేష్





'[illegible]'లో జగ్గయ్య, శారద

అలాగే, అంటూ ఆ లేఖలను నేను తీసుకున్నాను

''ఊర్వశి''కి వచ్చే వుత్తరాలు ఎలా వుంటాయో, ఒక తూరి ప్రేక్షకులు తెలుసుకోవడం మంచిదేగా!

### రాయదుర్గం... కోలార్ నుంచి లేఖలు !

రాయదుర్గం రమణయ్య రాసిన లేఖ అక్కయ్యా, మీరు నటించే చిత్రాలను పదే పదే చూడడం నాకు అలవాటు మా కుటుంబ సభ్యులు మీకు వ్యతిరేకులు అలాంటివాళ్ళు ''బలిపీఠం'' చూచి, వాళ్ళ అభిప్రాయాన్ని మార్చుకున్నారు

మీరు నాగేశ్వరరావుగారితో ''మహాత్ముడు, సన్యాసిరాజా'' చిత్రాలలో నటిస్తున్నారని తెలిసి మేమంతా ఎంతో ఆనందిస్తున్నాము.

కోలార్ నుంచి ఒక తెలుగు సమీక్షకుడు రాసిన వుత్తరం పతివ్రత ధర్మం మన హిందూ స్త్రీలకు ఆభరణం అట్టి మంచి పాత్రలను మాత్రమే మీరు పోషిస్తున్నందుకు, నేనెంతో గర్విస్తున్నాను మీలోని సింప్లిసిటి నాకు భాగా నచ్చింది మీరు మరిన్ని తెలుగు చిత్రాలలో నటించాలి. ''నటరత్న'' గారితో మీ రెండుకు నటించడంలేదు.

## నగారా

రాక్షస వత్సరం నిలిచి గెలిచింది
రాజకీయాల్లో వత్సర రాక్షసంగా
ఈ 'నలం' కాకూడదు అనలం
జ్వలనం కావాలి ఆ 'నలం'
నవ్యతల్లో, కవనంలో
చైతన్యంతో, అభ్యుదయంతో
అందిస్తుంది ఈ ఉగాది
నవ్యతలో నాకలోకం
కవనంలో నలపాకం
అవుతుంది ఈ ఉగాది
చైతన్యానికి నయాగరా
అభ్యుదయానికి నయానగారా

— కొడవంటి కాశీపతిరావు



'సెక్రటరీ'లో నాగేశ్వరరావు, వాణిశ్రీ



'మజేలేలో'' అన్న చిత్రంలో బానోభోపాలీ

తిరుపతి నుంచి పదమూడేండ్ల సుధ యిలా వ్రాసింది

అక్కయ్యా, నేను పదకొండవ తరగతి విద్యార్థిని ప్రతి రోజూ నువ్వు కలలోకి వచ్చి, చెల్లీ, నువ్వు తప్పక పాసవుతావు అని చెప్పావు, గత ఏడు కల నిజమయ్యింది

''ముత్యాల ముగ్గు'' చిత్రంలో మీరు, శోభన్‌బాబు నటించి వుంటె, ఒక్క సంవత్సరం ఆ చిత్రం ఆడేది మీ యిద్దరి జంట కన్నుల పంటగా వుంటుంది

నెల్లూరు నుంచి వనజాక్షి ఒక వుత్తరం రాసింది

అమ్మాయ్! ఇలా రాసేనని అనుకోకు నీకంటె యిరవై అయిదేండ్లు ఎక్కువ వుంటాయి నాకు నీలాంటి కుమార్తె వుండేది. ఇప్పుడామె విదేశాల్లో వుంది అయిదేండ్లకుగాని రాదు నీ ఫోటో ఒకటి పంపు తల్లీ నీకు నా ముద్దులు

(ఈ వుత్తరాన్ని శారద రోజూ అయిదారు సార్లయినా చదువుతుంది )

నెలకు సగటున వెయ్యి వుత్తరాలు వస్తాయి, శారదకు అందరికీ రిప్లై రాసే మనస్తత్వం శారదకు వుంది.

ప్రస్తుతం శారద నటిస్తున్న చిత్రాలు ''రాజేశ్వరి చిత్రవారి మహాత్ముడు, శ్రీనివాసా ఏజెన్సీస్‌వారి సన్యాసిరాజా, సావరిన్ ఎంటర్‌ప్రైజస్‌వారి శీలానికి శిక్ష, ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి చిత్రం, శ్రీ లలితా మూవీస్‌వారి ఇదెక్కడి న్యాయం'' చిత్రాలలో నాయికగా, వైవిధ్యం వున్న పాత్రలను పోషిస్తున్నట్టు పాఠకులకు తెలుపుతూంది మీ అభిమాన నటి శారద

# పెరిగే ప్రతి దశలోనూ శరీరానికి కావాలి

# కాల్షియం-శాండోజ్®



కాల్షియం, గర్భంలోని శిశువు ప్రథమ దశలోనే పాప పళ్ళలోనూ, ఎముకలలోనూ చేరు కోవటం మొదలెడుతుంది. పుట్టబోయే శిశువుకు శీఘ్రగతిలో ఎక్కువగా కాల్షియం కావాలి. అందుకే, మీకు మామూలు కన్న రెండు రెట్లు కాల్షియం కావాలి. మీరు తొందర గానే కాల్షియం-శాండోజ్ తీసు కోవటం మొదలెట్టండి.



పాప ఎముకలు, పళ్ళూ పటిష్టత కోసం కాల్షియం లభించేది పాలిచ్చి పెంచే తల్లి ద్వారానే. ఆమెకు మామూలుకన్న మూడు రెట్లు కాల్షియం అవసరం.



పెరిగే పాపకు పటిష్టమైన ఎముకలూ, గట్టి పళ్ళ కోసం కాల్షియం ముఖ్యావసరం. అందుకే, పెద్ద వాళ్ళ కన్నా, పాపకు కాల్షియం ఎక్కువగా కావాలి!



కాల్షియం ప్రతి దశలోనూ, ప్రతి వయసులోనూ, శరీరానికి కీలకమైన అవసరం. మరి కాల్షియం-శాండోజ్‌లో, కాల్షియం ఉత్తమోత్తమైన రూపంలో ఉంది. రోజుకు రెండు సార్లు, రెండు లేదా మూడు రుచిగల, రాస్ప్ చెరీ-వాసన గల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు, మీకు అవసరమైన కాల్షియం యిస్తాయి. దానితో బాటే విటమిన్ సి, డి మరియు బి12.

**శాండోజ్‌ను విశ్వసించండి-ప్రపంచమంతటిలో కాల్షియం తయారీలో అగ్రగాములు.**




## కాల్షియం-శాండోజ్®
## బిళ్ళలు ప్రతి రోజూ ప్రతి వారికీ

dCA/CS/15 F TEL

పదిహేను రోజుల్లో ఇంటర్వ్యూ పెట్టబోతున్నట్లు చెప్పి, ఎంప్లాయిమెంట్ ఆఫీసులో మీ పని మీరు చూసుకోండని సలహా యిచ్చాడు సుబ్బరామయ్య

## 6

ఆ రోజు ఉదయం బాత్‌రూమ్‌లోకి వెళ్లిన విశ్వం గంటసేపటివరకు బయటికి రాలేదు అతడు అందులోకి వెళ్లటం చూసింది సుమ పోనీ, స్నానం చేస్తాడు గామాలులే అనుకొని ఒక పది నిమిషాలు లోపలికి వెళ్లి తిరిగివచ్చింది అప్పటికీ లోపల నీళ్ళ చప్పుడు వినిపిస్తూనే ఉంది మరో పది నిమిషాలు అక్కడే నిలబడి చూసింది ఆ మనిషి జాడలేదు మరోసారి ఇంట్లోకి వెళ్లి ఓ ఇరవై నిమిషాలు ఆగి వచ్చింది అప్పటికి ఆ గది తలుపులు బిగించే ఉన్నయ్

'ఇదెక్కడి మనిషి — ఇదెక్కడి స్నానం! ఇంత సేపయినా బయటికి రాలేదు!' అనుకొని ఆపై ఓర్పు వహించలేక తలుపులమీద బడ బడ బాదేసింది

దాంతో అదిరిపోయి చటుక్కున బాత్‌రూమ్ తలుపు తీశాడు ఎదురుగా సబ్బు పెట్టిన గుడ్డలు!

"బట్టలు మీరు ఉతుక్కోవటం దేనికి? లాండ్రీకి వెయ్యకపోయారా విశ్వంగారూ?" — వెగటుగా ముఖంపెట్టి అంది సుమ

ఆమె మాటలను చాలా తేలిగ్గా తీసుకున్నాడు విశ్వం

"మనం తొడుక్కొనే బట్టలు మనం ఉతుక్కొంటే తప్పేమిటి సుమగారూ! ఎందులో అయినాసరే, మన పనులు మనం చేసుకోవటానికి నామోషీ ఫీలవకూడదు" అంటూ తన అభిప్రాయాలు వెల్లడించాడు

"అదికాదు నా ఉద్దేశ్యం ఎవరు చేసుకోవలసిన పనివారు చేయటంలోనే అందం ఉందని అంటున్నాను సపోజ్ చూడండి — బట్టలు కొనటానికి షాపులు ఉన్నాయి వాట్ని కుట్టటానికి టైలర్సు ఉన్నారు తొడగటానికి మనం ఉన్నాం మాసిన బట్టలను శుభ్రం చేయటానికి లాండ్రీలు ఉన్నాయి"

ఆమె మాటలకు సన్నగా నవ్వాడు విశ్వం

"అన్నీ ఉన్నాయి సరేకానీ మన జేబులో డబ్బులు ఉండొద్దుటండీ మరి? ఏదైనా సుమగారూ, మీరు ఒకప్రక్కనే ఆలోచిస్తున్నారు అసలు అన్ని వైపులా చూసుకొంటూపోతేనే మనిషి తన గమ్యాన్ని చేరగలుగుతాడు ఇపుడ మీరు పెద్ద డాబాలో ఉన్నారు మా ఊళ్ళో రామనాథం మాస్టారు పాత పెంకుటింట్లో ఉంటున్నారు నేనొక పూరిపాకలో ఉండి వచ్చాను — ఈ తేడాలు ఎక్కణ్ణుంచీ వచ్చాయి? ఎందువల్ల వచ్చాయి? ఆలోచించి చెప్పండి" అన్నాడు

ఆ కంఠంలో ఏం మహత్తు ఉందోకాని విశ్వం మాటలు ఇంకా ఇంకా వినాలన్న కుతూహలం అప్పడే బయలుదేరింది సుమలో

"ఆర్థిక వ్యత్యాసాలు అనుకోండి అయినా మీకు ఏది కావలసివచ్చినా మొహమాట ఎడకుండా ఇంట్లో అడిగి తీసుకోమని మా నాన్నగారు చెప్ప లేదూ?"

# కాలమిచ్చిన తీర్పు

(21వ పేజీ తరువాయి)

అనాడు, "విశ్వం! ఇకనుంచీ నువ్వు మా కుటుంబంలో ఒక సభ్యుడివి ఈవేళ్టినుంచీ ఇది పరాయి ఇల్లని ఎప్పుడూ ఫీలవవద్దు నీకు ఏ అవసరం వచ్చినా — డబ్బయినాసరే నన్ను అడుగు నేను లేకపోతే ఇంట్లో అడుగు భిడియపడకు" అన్నాడు సుబ్బరామయ్య విశ్వంతో నలుగురి ఎదటే ఆ సంగతి సుమకూ తెలుసు అందుకే అలా అంది

(మరో విషయం విశ్వానికి డాబా వరండా గది కేటాయించి అందులో ఉండమన్నాడు అతణ్ణి అలాగే ఉంటున్నాడు విశ్వం)

"చెప్పారని? అసలు మీ ఎవర్నీ అడగనక్కరలేకుండానే — ప్రస్తుతం నా దగ్గర కొంత డబ్బుంది అయినా నా కాళ్ళమీద నేను నిలబడగలిగేవరకు నా పనులు నేనే చేసుకొంటాను" అని నిక్కచ్చిగా చెప్పేశాడు

"సరే మహానుభావా! మీ సిద్ధాంతాలమీదే మీరు నడవండి అయితే — ఇప్పుడుమాత్రం త్వరగా తెమిలి యివతలకు రండి!" అని నవ్వు ముఖంతో చెప్పి, అక్కణ్ణుంచి ఓ నాలుగు అడుగులు వేయటంతోనే సుమకు ఎదురైంది సుజాత




"ఏమిటి — అతన్ని ఏమో అంటున్నావ్?" అడిగింది చెల్లెల్ని

"నేనేమన్నాను?" ఏమీ ఎరగనట్లే ముఖం పెట్టింది సుమ

"సుమా! నన్ను నీ ఇష్టంవచ్చినట్లు అమ నీ అక్కగా పుట్టినందును నేను పడతాను అంతే కానీ, పరాయివాడు అతడు యితరుల విషయంలో కొంచెం ఒళ్లుతెలుసుకొని మాట్లాడటం మంచిది" అని హెచ్చరించి విసురుగా లోపలికి వెళ్లింది సుజాత

అక్క మాటలకు చీమకుట్టినట్లయినా లేకుండా మామూలుగానే — సుజాత వెనకే వెళ్లింది సుమ

వాళ్లిద్దరి మాటలూ బాత్‌రూమ్‌లో వున్న విశ్వానికి వినిపించాయి అప్పడే తనంటే సుజాతకు 'ఆమెవాడన్న' అభిప్రాయం ఏర్పడిపోయిందన్న మాట! ఎంత విచిత్రం — లోలోపల నవ్వుకున్నాడు

రెండు నెలలు మామూలుగానే గడిచిపోయాయి ఆ గడిచినకాలంలో జరిగిన మార్పులు—

మెడిసిన్ ఎదివే ఆశ ఎప్పుడైతే వదులుకున్నాడో అప్పడే త్వరపడి బి ఎస్‌సి క్లాసులో చేరాడు సుధ కృష్ణకు తాను అత నన్నట్లే ఆఫీసులో బంట్రోతు ఉద్యోగం యిచ్చాడు సుబ్బరామయ్య రామనాథం తన ఉల్లుడి గురించి ఒకటి రెండుసార్లు వచ్చివెళ్లాడు ఆ తర్వాత యిక రమేష్ తన మామయ్య సహకారంతో బ్యాంకి నుంచి లోను తీసుకొని గాంధీ చౌక్‌లో ఒక బుక్‌స్టాల్ తెరిచాడు

ఇక విశ్వం సుబ్బరామయ్య యింట్లో ఉల్లుకుపోయాడు అతడికి బట్టలు లవీ కుట్టించి, చదువు విషయంలో తెలియనివి చెప్పించుకోవటానికి ఒక ట్యూటరును మాట్లాడాడు సుబ్బరామయ్య రోజూ విశ్వమే ఆ ట్యూటరు యింటికి వెళ్తూంటాడు సుధ, సుమ 'బావగారు' 'బావగారు' అని ఉతడిచుట్టు తిరుగుతున్నారు విశ్వం కూడా వాళ్లని పేరుపెట్టి పిలవటం, సుందరిని 'అత్తయ్యగారూ' అని సంబోధించటం అలవాటు చేసుకొన్నాడు కానీ, సుబ్బరామయ్యనే వరసపెట్టి 'మామయ్యగారూ' అని పిలవలేకపోతున్నాడు అతణ్ణి ఏ మడగవలసి వచ్చినా 'సర్' అని అంటూంటాడు ఇక సుజాత తరచూ కాఫీ పలహారాలను తనే తీసుకువెళ్లి యిస్తోంది విశ్వానికి అయితే బిడియంవల్ల ఏమీ మాట్లాడలేకపోతోంది తను ముభావంగా వుంటే నొచ్చుకుంటుందేమో—ఏదైనా మాట్లాడదాం అని అతడు ప్రయత్నించినా సిగ్గుపడి లోపలికి పారిపోతోంది ఆమె

* * *

ఆ మధ్యాహ్నం — సుజాత కాఫీ, టిఫిన్ తిసుకొని విశ్వం వున్న గదికి అని బయలుదేరింది సుజాత తీరా గదివరకు వెళ్ళి మొత్తదగ్గరే ఆగిపోయింది

సుమ కూడా అక్కడే వుంది వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకొన్నారో — విరగబడి నవ్వుకొంటున్నారు

అది గమనించిన సుజాత హృదయం కుతకుత వుడికిపోయింది ఏమిటి వీళ్ళిద్దరి ఈ చొరవ? 'ఎంతో మంచిమనసు కలవాడు విశ్వం' అని చెప్పారు నాన్న మరి అతడూ యిలా ఒళ్ళుతెలియకుండా ప్రవర్తిస్తున్నాడేం? అసలు అతణ్ణని లాభంలేదు దీనికంతటికీ కారణం సుమ! యిదే అతడి హృదయంలో విషపు పొరలను ప్రవేశపెడుతోంది ఏదో అదృష్టంకొద్దీ యీ అవకాశం కలిసివచ్చిందని సంబరపడుతూంటే — దాన్ని తనకు దక్కనివ్వకుండా చేయాలని ప్రయత్నిస్తోందేమిటి సుమ? అవును! మొదట్నుంచీ దానికి తనంటే గిట్టదు తన బ్రతుకు బాగుపడటం దానికి ఇష్టంలేదు అందుకే ఇలా ప్రవర్తిస్తోంది —

అలా అనుకొని నిరుత్సాహపడి — కర్తవ్యం కోసం తన చేతిలో ఉన్న ట్రేను తీసుకొని వెళ్ళి విశ్వం ముందు బల్లమీద పెట్టింది విసురుగా



# విచిత్రం కాని కథ

సిహెచ్ మధు

"నీకెందుకో ఈ శరీర మివ్వటం నాకిష్టం లేదు ఇదేమిటి ? నీకీ గుణం" అంది విజయ

సాయంకాలం ఏడుగంటలు

పనిమీద ఈ ఊరువచ్చి చిన్నప్పటి స్నేహితురాలు — విజయ (టీచర్‌గా ఇక్కడ పని చేస్తుందని తెల్సి) ను కలవాలని — ఇల్లు తెల్సుకొని ఐదుగంటలకు విజయ ఇల్లు చేరుకున్నాడు

విజయకు ఇద్దరు పిల్లలు

భర్త చనిపోయాడు

చాలా అందమైన వ్యక్తి

కాఫీ టిఫిన్ తర్వాత

"చిన్నప్పటి నుండి నిన్ను ప్రేమిస్తున్నాను నీవైతే ?" అన్నాడు మోహన్

ఆశ్చర్యపోయింది చిన్నప్పటి ప్రేమకు, ఇప్పుడు అడిగినందుకు

సమాధానం మొదలే విన్నారు

విన్న తర్వాత —

వెళ్తానంటూ బయట కొచ్చాడు

*　　*　　*

మోహన్ ధనవంతుడు ఆ విషయం చెప్పాల్సిన అవసరంలేదు

బయటకొచ్చి బస్సుస్టాండు కొచ్చి మోహన్ మనసు స్థిమితంగాలేదు విజయ .. అందం

విజయే కావాలా?—

ఎవరో ఒకరు కాలక్షేపానికి

ఎవరైనా అయితే బావున్ను—

అదేమాట అక్కడ కూలితో అన్నాడు

"మంచిదా?"

"ఆఁ"

"యాబది"

"ఫర్వాలేదు"

*　　*　　*

కూలీవాడు సరిగ్గా విజయ యింటికి తీసుకొచ్చాడు

ఆశ్చర్యపోయాడు మోహన్

అయినా లోనికెళ్ళాడు

కూలి లోనికెళ్లి విజయతో మాట్లాడాడు. విజయ బయట కొచ్చింది.

ఆశ్చర్యపోయింది

లోపలికెళ్లిపోయింది

కూలివాడెళ్లిపోయాడు

మనసు స్థిరంగా లేదు

లోనికెళ్లిన విజయ బయట కొచ్చేదాకా వెయిట్ చేయలేదు

టేబుల్‌మీద వంద పెట్టి బయట కొచ్చాడు

రెండు రోజుల తర్వాత విజయ నుండి లెటర్

"ఇద్దరు పిల్లలు డబ్బుచాలదు అందుకని ఇంకోమాట ప్రేమంటున్న నీకు శరీరమివ్వలేకపోయాను"

---

## చుర్మా

ఈ 'చుర్మా'ను సాధారణంగా పంజాబీలు చేస్తుంటారు దీనిని ఇంచుమించు 'సుఖా రొట్టె'ల మాదిరిగా చేస్తారు దీనిని గోధుమపిండితో చేస్తారు ఒకగంట ముందుగా గోధుమపిండిని మెత్తగా కలపాలి అందువల్ల రొట్టె గుల్లబారుతుంది రొట్టెను దళసరిగా వత్తాలి రొట్టెను పెనంమీద కాల్చుతూ, అట్లకాడతో (లేక గరిటతో) రొట్టెను త్రిప్పుతూ రొట్టెను మాడకుండా చూసుకోవాలి రొట్టె పైపొరకి చిన్నగా కన్నంపెట్టి, ఆ కన్నంలో ఒక గరిటెడు పంచదారను ఆ పొరలోనికి వెళ్లేటట్లు చేయాలి వెంటనే ఆ రొట్టెను నాలుగువైపులా ఒడతపెట్టి, ఆ రొట్టెను గట్టిగా పిసకాలి మనంచేసే ప్రతీ రొట్టెను ఐదునిమిషాలపాటు మెత్తగా పిసకాలి ఈ రొట్టెపై రెండుచెంచాల నేయి వేస్తే ఇంకా రుచిగా ఉంటుంది ఒకరు రొట్టెను కాల్చి ఇస్తూ ఉంటే, రెండో వ్యక్తి ఆ రొట్టెను పైవిధంగా చేయటంవల్ల పని తేలిక అయిపోతుంది

—కె గిరిజాదేవి,

(శ్రీకాకుళం)

## ఉగాది పచ్చడిని సేవించుమన్నా!

నిజంగా మన ఉగాదే కొత్తసంవత్సరాది ...
ఎందుకని వేరే అడగనక్కరలేదు...

కొత్త ఎండలొచ్చేశాయి. కొత్త ఆవకాయకి మిరపకాయలు దంచేస్తున్నారు ... కొత్తగా మల్లెపూలు వచ్చేశాయి. నూతన దంపతులు కళ్లకు పెట్టుకున్న కాటుక ఆరకుండానే కొత్తగా విడుదలైన సినిమాలమీద పడిపోతున్నారు...

# సామాన్యుని సహాయకుడు

కొత్త చింతపండు పులుపు ఉగాది ధాకానైనా కాచుకోకుండా పాత చింతపండు కావాలనే వాళ్ల చాదస్తం చూసుకుని నల్ల చింతపండు రేటు పెరిగిపోయింది... వేపాకు కొత్తది, బెల్లం కొత్తది. దాని రుచి ఏటా ఎప్పటికప్పుడు కొత్తది...

నిజంగా జనవరి ఒకటి అటు చలికాలారంభంలోనో యిటు ఎండాకాలం మొదట్లోనో రాదు. చలికి అలవాటుపడతాం అప్పటికి క్యాలండర్ మొదట్లోతప్ప జనవరి కొత్తగాడుండదు.

అంచేత మన ఉగాదికున్న కొత్త థ్రిల్ జనవరి ఒకటిలోలేదు. మన తెనుగుదేశంలో ఉగాది నుంచి కొత్తవాతావరణం ప్రారంభంకావటం వందల సంవత్సరాలుగా మనం అలవాటు తప్పించినా మానటం లేదు. అందువల్లనే మన ఉగాదే నిజంగా కొత్త ఏడాదికి నాంది... ఏమంటారు? పైగా పంచాంగం వుంటుంది. అందులో రాశిఫలాలుంటాయి — వాటిలో మన పై ఏడాది కోర్కెలకు కొత్త చిగుళ్ళు వస్తాయో లేక పురుగు పట్టూ పడతాయో తెలిపె సంగతులుంటాయి–నమ్మో నమ్మకపో వెతుక్కుంటూ చదవటం ఖాయం. ఇదంతా కొత్తగానే వుంటుంది...

కాని యీ ఉగాది కొత్తదనం అంతా ఒక్కరోజే... మర్నాడే యీసారి ఏప్రిల్ ఫస్టొస్తోంది... మైడియర్ వాట్సన్! యిది కొత్తదనుకున్నావ్ కదూ అంతా పాతఏడాదేనోయ్ కాకపోతే నిన్న అంతా కొత్త అని భ్రమసిపోయావ్ యినాళ ఫూల్వైనావ్ అని... కాని యీ విధంగా కొత్తకి అర్రులు చాచి ఫూల్ అవడంలోకూడా జీవితం సుజా జీవిత రహస్యం రెండు ఉన్నాయి అని చెపుతూ ఉగాదివచ్చింది. పచ్చడి సందేశంలోనే వుందా సత్యం. కానా?

[సిరాజీ]




కాకినాడలో బి. టెక్. చదువుకుంటున్న పి. వి. ఎస్. కామేశ్వరరావుకి హాస్టలులో చదువు యింటి దగ్గిర కుదిరినట్లు కుదరలేదంటున్నాడు.



నాకు మార్కులు కన్నా సబ్జక్టు తెల్సుకోవాలని ఎక్కువ సరదా అంటూనే తనకి యింటర్మీడియట్ లో గ్రూప్ లో రాంకైమూడుం ముప్పాతిక శాతం మార్కు రొచ్చాయని చెప్పాడు.

## యువతరం

ట్రాజడీ సినిమా లిష్టం. కొత్తవాళ్లతో తీసినవైతే బాగుంటాయట. శాస్త్రీయ సంగీతానికి చెవి యొగ్గే కామేశ్వరరావు బాల మురళీకృష్ణ గాత్రాన్ని అభిమానిస్తాడు. అప్పుడప్పుడు లైబ్రరీలకు వెళ్తాడు. ఎక్కువగా చదువుకుంటూ గడపడం చేత ఆటలంతగా ఆడలేదింతవరకూ. అమ్మాయిలని సర్దాగా మాటకి మాట చెప్పే తీరున "ఏడిపించాలనుంటుందిట" కాని ఆ ఛాన్సు యింకా రాలే ... ఇలా అంటున్నాడు యీ కామేశ్వరరావు.

"నా ఆశయం గొప్ప సైంటిస్టు నవ్వాలని" ఉంది. మనం ఎందుకు పుడతామో తెలీదు, ఎందుకు చస్తామో అంతకన్నా తెలీదు. భగవంతుడు మనకీ జన్మలని ఇవ్వటంలో నాకేమి అర్థం కనిపించటంలేదు. ఈ అర్థంలేని దావుబ్రతుకుల మధ్య ఉండే, ఈ అల్ప బ్రతుకులో, బ్రతికితే హంసలా ఆర్నెల్లు బ్రతికినాచాలు. కాకిలా కలకాలం బ్రతికేకంటే! బ్రతికితే నలుగురూ గుర్తించేలా, నలుగురిచేతా ఓహో అనిపించుకోవాలి!! నాకు న్యూటన్, ఐన్‌స్టీన్ అంటే ఇష్టం.

★★★

# నెరసిన జుట్టు మీ వయసును బయట పెట్టాలా?

## నన్ను చూడండి. నా వయసు ఎంత అంటారు?

మా కూతురుకు పెళ్లి చేశాను. కొడుకు ఉద్యోగంలో కుదురు పడ్డాడు. అంత మాత్రం చేత నేను ముసలి దానిలా కనబడాలా? ఏమాత్రం కాదు.

అందుకనే జుట్టుకు రంగు వేయడానికి ఏమాత్రం సంకోచించలా. జుట్టును పాయలు తీయడం, వాటికి రంగు పులమడం, ఇంటికీ వంటికీ రంగు అంటించుకోవడం — అన్నీ బాధ పడ్డాను. అందుకు గోద్రెజ్ హేర్ డై నా బాధలన్నీ దూరం చేసింది.

భారతదేశపు మొట్టమొదటి తనంతతానే వ్యాపించే హేర్-డై




ఇప్పుడు జుట్టుకు రంగు వేసుకోవడం ఎంతో సులభం.
గోద్రెజ్ హేర్ డైతో నేను చేయవలసిందంతా స్పాంజ్ ని డైలో ముంచి రాయడమే — రంగు తనంతట తానే, సరిసమానంగా, సులభంగా వ్యాపిస్తుంది. దాని సువాసన హాయిని గొలిపించడమే కాదు, అది ఎంతో కోమలం కూడా.

గోద్రెజ్ హేర్ డైని నేను అనేక మాసాలుగా ఉపయోగిస్తున్నా. నా జుట్టుకది, కొత్త యవ్వనం, సొగసు, సహజమైన నల్లదనం సమకూరుస్తుంది.
ఇంతకీ నా వయసు ఎంతంటారు?

**గోద్రెజ్** పర్మనెంట్ హేర్ డై
ముందు అన్ని హేర్ డైలూ తెల్ల బోయాయి.

పురుషుల కోసం స్త్రీల కోసం కూడా. 2 రంగులు:
సహజ నలుపు, గాఢమైన బ్రౌను.

## మందు లేండ మంచిగంధం

(13 వ పేజీ తరువాయి)

మళ్లీ అడిగాడు "నేను చెప్పినది ఏమాలో చించావు" అంటూ

ఏమంటాడు తన కొడుక్కు ఇంత అదృష్టం పడుతుంటే ఏతండ్రి కాదనగలడు అతని మౌనాన్ని గమనించిన పరంధామయ్య "అమ్మాయి మొన్ననే కాశ్మీరు వెళ్లింది పదిహేను రోజులవరకూ రాదు లేకపోతే నీవు చూసి వెళ్లేవాడివి" అన్నాడు

"అబ్బే అదేంలేదు పరం, నువ్వు అబ్బాయిని చూడాలన్నావా! అక్కరలేదులేవోయ్ అన్నాడు భరోసాగా" అందమైన ఆపరిసరాలలో కోడలిని ఇంకా అందంగా వూహించుకున్న నారాయణ

"అయితే ఇరువది రోజులకొక లగ్నం వుంది అది తప్పితే ఈ సంవత్సరానికి మరి లగ్నాలు లేవట్ట ఇవ్వాళ దశమి, సోమవారం దివ్యంగా వుంది తాంబూలాలు పుచ్చుకుందామా లేక మీవాడిని సంప్రదించాలా" అన్న పరంధామయ్య మాటను మధ్యలోనే అందుకుని "మావాడు నామాట కాదనడు ఇల్లరికపు టల్లుడినైనా ఇంట్లో నాకెదురు లేదుకాని ఈరోజులలో కూడా వధూవరులను ఒకళ్ల నొకళ్లు చూసుకోనకుండా ఈ నిశ్చితార్థ మేమిటా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు నారాయణ

"వోరి నీ అసాధ్యం కూలా! వాళ్ళు చూసుకునే దేమిటి, మన పిల్లలు మన ప్రతిరూపాలు కాదూ! మనమీపనిచేసి అటు నువ్వు మీవాళ్లనూ, ఇటు నేను అమ్మాయినీ ఒక్కసారి ఆశ్చర్యంలో ముంచివేద్దాం" అన్నాడు మీసం దువ్వుకుని పరంధామయ్య

"మరి ఇంత కొద్దికాలంలో పనులు అవ్వవద్దూ?"

"డబ్బులోయ్ డబ్బులు అవివుంటే కొండ మీది కోతి దిగివస్తుంది" అంటూ ప్రక్కనే వున్న ఇనప్పెట్టె తెరచి నోట్లకట్టను బయట పెట్టాడు పరంధమయ్య

తాంబూలాలు పుచ్చుకొని పరంధామయ్య ఇచ్చిన పాతిక వేలూ తీసుకుని ఇల్లు చేరాడు లక్ష్మీనారాయణ

"ఏమిటి నాన్నా! నాకు పెండ్లేమిటి?" అంది నారాయణ గడప దాటిన క్షణం సుడిగాలిలా తండ్రి గదిలోకి వచ్చిన లలిత

"తప్పదమ్మా! స్నేహితుడిని మోసం చేస్తున్నానన్న బాధ వున్నా ఈ అవకాశం జారిపోతే నేను నీకు ఈ జన్మలో పెండ్లి చేయలేను"

"కాకపోతేనేం? మోసం చేసి నన్ను కట్టబెట్టినా, తరువాత నేను సుఖపడతానని నమ్మక మేమిటి?"

"నువ్వు సుఖపడినా లేకున్నా ఇది కాకపోతే నీకీ జన్మలో పెళ్లి కాదు అన్నీ వుండే నీకు పెండ్లి చెయ్యలేక పోయానన్న బాధ నేను భరించలేను ఈ విధంగానైనా నీ పెండ్లి జరిగి తీరాలి నా మాట కెదురు చెప్పకు" అన్న తండ్రి మాటలకు ఇంకేమనే ధైర్యం లేక నోరు మూసుకుని వూరుకున్నా ఆమె గుండె నిండా గుబుళ్లే

సూర్యం అదృష్టాన్ని గురించి ఆ పల్లెటూరిలో పెద్ద ప్రచారం చెలరేగింది పెండ్లికి పెద్ద ఎత్తున పల్లె పల్లె అంతా కదిలివచ్చారు సూర్యం అదృష్టం చూసి తరించాలన్నట్లు

విడిదింట్లో దిగిన ఆడవారు పెళ్లివారిల్లూ, పెళ్ళి కూతురినీ చూడాలని ఒకటే ఆరాటం వియ్యపురాలిని వేధించి మరీ తీసుకు వెళ్లారు ఇల్లూ ఆ వైభవమూ చూసి మతులు పోగొట్టుకున్నారు పెండ్లి కుమార్తెను చూపెట్టమని అడిగారు

"మంగళ స్నానం చేయిస్తున్నా"రన్నారు

కొంత తడవఆగి మరల అడిగితే "ఎక్కడో పూలజడ వేస్తున్నా" రన్నారు ఇంకోసారి "గౌరి పూజకు" వెళ్లిందన్నారు

ఆడవారిలో కొందరికి అనుమానం వచ్చింది గుస గుసలు బయలుదేరాయి పెండ్లి కుమారుడు మండపం మీదికి వచ్చాడు ఆడవారంతా పెండ్లి కుమార్తెను చూడాలని ఆతురతతో గుమ్మం కేసి చూస్తున్నారు

వధువును తీసుకురమ్మని పురోహితుడు పాలికేక పెట్టాడు గడపలో కాలు పెట్టిన పెండ్లి కుమార్తెను చూసిన ఒక్కరి ముఖాన నెత్తురు చుక్క లేదు పెండ్లి కుమారుని ప్రక్కన కూర్చోబెట్టారు మన్మధునికి మారుపేరుగా వున్న సూర్యం ప్రక్కన గొంగిలి పురుగులా తోచింది లలిత అందరికి సూర్యం తల్లి చివాల్న లేచి సూర్యం దగ్గరికి నడచింది ఈ లోపలే ఎద్దుల్లాంటి పదిమంది కర్రలతో పందిట్లో

ప్రత్యక్ష మయ్యారు బయట ప్రహరీ గేట్లు మూయిబడ్డాయి ఇవన్నీ చూసిన వారికి పై ప్రాణాలు పైనే పోయాయి ఎవరికి వారు "ఎరక్కపోయి ఈ పెండ్లికి వచ్చాంరా భగవంతుడా!" అనుకున్నారు పరిస్థితి గమనించిన సూర్యం లలిత మెడలో "తాళి" కట్టాడు

మామగారు ఏమివ్వబోయినా సూర్యం నిరాకరించాడు "ఇపుడు నేను మీనుండి ఏమి స్వీకరించినా అందరూ మీ సొమ్ము కాశించి మీ అమ్మాయిని వివాహమాడా ననుకుంటారు గాని, నాతండ్రిమాట విని పిల్లను కూడా చూడకుండా చేసు కు న్నా న ని ఎవరూ అనుకోరు అవన్నీ మీరే వుంచుకోండి" అన్నాడు

అతని మనసు కుతకుత ఉడికిపోతున్నది ఇంట్లో వారందరిమీదకసి అందరినీ ఏమైనా చేసేయాలన్నంత పగ కలుగుతోంది వదిన పరిహాస మాడింది "ముద్దుల మరిదీ! మీనాన్న నీకో బంగారు పంజరం సంపాదించి పెట్టాడు"ని పుండు మీద కారం చల్లి నట్లు సూర్యం మనస్సు భగ్గున మండింది ఎవరికీ చెప్పకుండా పట్నం వెళ్ళిపోయాడు

మూడవనాడు ఎవరో అమ్మాయితో సహా వచ్చాడు ఎవరూ అతనినేమీ అనలేదు వదినగారేదో కలుగజేసుకోబోతే, తల్లి అందు కుని "మగవాడు వాడికేం మహారాజులా వాడిష్టమొచ్చినదాన్ని తెచ్చిపెట్టుకుంటాడు ఈమారెమ్మతో కాపురం చేయటానికి వాడి ఖర్మేం కాలింది" అంటూ సమర్ధించింది

సూర్యం పగలూ, రాత్రీకూడా సాధ్యమైనంత వరకూ బయటకు రావటంలేదు ఆమెలోటిదే లోకం అన్నట్లుంటున్నాడు

ప్రొద్దస్తమానం "లలితా! మాకు కాఫీ తెచ్చిపెట్టు" "లలితా! మాకు ఏదన్నాటిఫిన్ తెచ్చిపెట్టు" "మా కి ద్ద రి కీ భోజనం ఇక్కడికే పట్రా" అంటూ కేకలు తీరా వాళ్ళడిగినవి తీసుకుని గదిలోనికి వచ్చేసరికి "డార్లింగ్ నీ పెదాలేమిటి ఇంత తీయగా వున్నాయి! అమృతమేమైనా దాచావా" అంటూ ఆమె పెదవులు ముద్దుపెట్టు కుంటూ, డియర్ నీ కౌగిలి స్వర్గానికి కూడా పోనివ్వనంటున్నది" అంటూ ఆమె యెముకలు "పెటపెటలాడేలా" తన కౌగిలిలో నలిపే స్తూనో కనిపించేవాడు

ఈ చర్యలని లలిత చూసి ఈర్ష్యతో ఏడవాలి అపుడు తను కసితీరా నవ్వుకోవాలని సూర్యం కోరిక కాని అడిగినవన్నీ చిరు నవ్వుతో అందిస్తున్న లలితనుచూసి "కసి" ఇలా కూడా తీరకపోయేసరికి కోపం ఇంకా తారాస్థాయికి చేరేది "మొద్దావతారం అది కూడా తెలుసా" అంటూ నుదురు కొట్టు కునేవాడు

మొదట్లో అందరూ పట్టించుకొనక పోయినా లలిత ఆ అమ్మాయికి అన్నీ అందిం చటం కష్టం కలిగింది అందరికి పైగా ఆమె "అదిబాగోలేదు, ఇది బాగోలేదు" అని లలితని పనిమనిషికన్నా హీనంగా తిట్టడం బొత్తిగా నచ్చటం లేదు అత్తగారికి

ఒకసారి ఆమెకు జ్వరం వచ్చింది లలిత పరిచారికలా సేవచేసింది ఆమెకు జ్వరం తగ్గిపోయిన తరువాతకూడా లలితలో సేవ లందుకునే అవకాశం కోల్పోవటం ఇష్టంలేక తగ్గనట్లే నటిస్తున్నది సూర్యానికిది కొంచెం బాధకలిగించింది

ఒక రోజు కాఫీ తెచ్చి యిచ్చిందది ఇద్దరికీ లలిత కప్పు నోటికానించుకుని విసిరి గోడకేసి కొట్టి "కాఫీయా! ఇది కషాయమా?" అని గర్జించింది

కాఫీ త్రాగుతున్న సూర్యం ఆశ్చర్యంగా ఆమె వైపు చూశాడు కాఫీ తనకి రుచిగానే వున్నాయి

"ఇంకా అలాగే దయ్యంలా నిలబడ్డావా! వెళ్ళి హార్లిక్స్ తీసుకురా" అంటూ నిల బడిన లలితని బలంగా కాలితో తన్నింది లలిత తల వెళ్ళి గోడకు కొట్టుకుంది

సూర్యంలోని మానవత్వం మేలుకున్నది ఎంత కాదన్నా లలిత తన యిల్లాలు ఈమె తను యిచ్చే సొమ్ము కాశించి శరీరం అప్ప గించే బజారు స్త్రీ

"స్కౌండ్రల్! యూ ఫస్ట్ గెటవుట్" అంటూ జుట్టు పట్టుకుని "నీకెంత అహం కారం కిరాయికి వచ్చినదానివి, దానిని కాలితో తంతావా!" అంటూ బజార్లోనికి నెట్టి ఢళ్ళున తలుపు వేసుకున్నాడు ఏడుస్తూ అక్కడే నిలబడిన లలిత దగ్గరికివచ్చి వోదా ర్పుగా ఆమె భుజంమీద చేయివేసి ఆమె కళ్ళ లోకి చూశాడు

లలిత ఎంత వికృతంగా వున్నా ఆమె మనసెంతో అందంగా వుండి ఆ అందం ముందు శరీరాకృతిని కనిపించనీయలేదు ఆ సంవత్సరం పంట అధికంగా పండ సంసారం పాలు పొంగి నట్లు పొంగింది అప్పటినుంచీ సూర్యంతో బాటు మిగిలినవారుకూడా లలితను అపురూపంగా చూసుకుంటున్నారు

లలిత కండ్లలో తిరిగిన నీటిపొర చూసి నొచ్చుకున్న ప్రమోద "పిన్నీ! నీ మనసు నొప్పించానా" అంది దీనంగా

"లేదమ్మా మీ బాబాయిగారు వచ్చినట్లు న్నారు చూసివస్తానుండు" అంటూ క్రిందికి వెళ్ళింది

స్వగ్రామానికి వెళ్ళిన మోహన్ రావటా నికి దాదాపు నెల రోజులు పట్టింది బస్సు దిగగానే ప్రమోదకు మశూచివచ్చిన సంగతి తెలిసింది మోహన్ గుండెలు దడదడ లాడాయి ప్రమోద అనాకారితనాన్ని 'యే



వై. ఎస్. ఆర్. కావలి.

ప్రేమించుకున్న హృదయాలెప్పుడూ భగ్న హృదయాలై పోతాయి ఎందుకు?

ప్రేమ భవనానికి గట్టి పునాది వేయక పోవడం వల్ల.

ఎస్. వి. ఆర్. బెంగుళూరు

సమాన హక్కులంటూ పోరాడే ఈ కాలంలో స్త్రీలకంటూ ప్రత్యేకంగా బస్సు సీట్లు కేటాయించడం దేనికి?

మీకూ మాకూ కూడా సుఖంగా వుండడానికి! సాటి మనిషి పట్ల కనీసపు సభ్యత ప్రదర్శించే సంస్కారం వుంటే మాకీ ప్రత్యేక సీట్లు అక్కర లేదు.

కె. ఎస్. ఎన్. ధర్మవరం

తమరు ఎంత స్త్రీ సమానత్వం గోలపెట్టినా ఒక వంక పురుషుడు స్త్రీ కంటే ఒక్క శరీరకంగా బలవంతుడు అని మీరే స్త్రీ బలహీనత ఒప్పుకుంటున్నారు సంతోషం.

శారీరకంగా బలవంతులైనంత మాత్రాన గర్వపడ్డంలో అర్థం వుందా అని!

కె. ఎస్. ఎన్. ఖానాపూరు

ఈ సమాజంలో మనిషికి వున్న విలువ ఎటువంటిది. ఆ విలువను మనిషి ఎలా వినియోగించేసుకుంటున్నాడు.

మనిషి సమాజానికెంత వరకూ ఉపయోగపడుతున్నాడో అతగాని విలువ అంతే వుంటుంది. కాని, స్వార్థం నేర్చిన మనిషి తనకొచ్చిన అవకాశాన్ని పట్టి సమాజ శక్తిని తన స్వంతానికి హాయిగా వినియోగించుకుంటున్నాడు.

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

జి. ఎమ్. డి. హైదరాబాదు

మీరు రచించిన 'ప్రేమించు ప్రేమకై' గురించి ఇద్దరు వాదులాడుకుంటూండగా విన్నాను. ఒకరు దాట్లో ఏముందనే రెండో వ్యక్తి అంతా దాట్లోనే వుందని మీ డిఫెన్సుకొస్తున్నాడు. మీరా నవల ఎందుకు రాసినట్టు.

ఒకసారి ప్రేమలో మోసగింపబడిన స్త్రీ మళ్ళీ ప్రేమలో పడడానికి భయపడుతుంది. నిజమైన ప్రేమ గంభీరంగా లోతుగా ప్రవహించే నదిలాగా గోలగోలగా ప్రవహించదు. అన్న నా ఉద్దేశ్యానికై అల్లిన కథ. ఏది రాసినా అందరినీ మెప్పించడం కోసం ప్రయత్నించడం దండగ కదా. అందరికీ అన్నీ నచ్చాలని లేదు కద.

ఎమ్. కె. ఎస్. ఎమ్. చిత్తూరు

కట్నం తీసుకోను. కాని ఆస్థి లేదని అంటున్నత చూపుతున్నారు. అందుకే మీ స్త్రీ జాతిపై జాలి చూపరాదంటాను.

అయితే జాలి చూపాలనా కట్నం తీసుకోపోవడం!

వై. ఆర్. ఆర్. హైదరాబాదు

ఎంతటి విశాల దృక్పథం వున్నా ఒకరి నొకర అర్థం చేసుకొనుట. . .

దుర్లభం అంటారా? కాదు. ఒకళ్ళని ఒకళ్ళు అర్థం చేసుకుందుకు కావలసినది విశాల దృక్పథం కాదు. సహృదయం. సాటి మనిషిగా గౌరవం కావాలి ముందు.

జి. వి. కె. ఆర్. హైదరాబాదు

ధైర్యంగా ఆలోచనలైతే చేస్తాం గాని ఆచరణలో పెట్టడానికి ఏం చేయాలి? అర్థం కావడంలేద కె. రా. గారూ.

చూడండి సార్, అవి ధైర్యం అయిన ఆలోచనలు. చదరంగంలో పావుల్లాంటివి. ముందుకు తోస్తే చావవచ్చు కాని అదే గెలుపు ఆటకి నాంది కూడా కావచ్చు కదా. అంచేత ధైర్యంగా ఆలోచనలు ఆచరణ వేపు రానివ్వండి మరేం ఫరవాలేదు.

ఎమ్. ఎస్. పి. ఆర్. విజయవాడ.

నేను కథలూ నవలలూ చాలా రాశాను. ఏ పత్రికలో ప్రచురించే అవకాశం వుందోచెప్తారా?

ఎలా చెప్పను? కనీసం ఆడపేరేనా పెట్టుకుని రాయి బాబూ. ఏ పత్రికకు పంపినా చదివేనా చూస్తారు! లేదా ప్రచురించేనా చదువుతారు. బాగా పేరు వచ్చేశాక నేనేనండీ ఫలానా రచయిత్రి పేరు అంటూ చెప్పీచెప్పనట్టు చెప్పి బయట పడవచ్చు. ఎలా వుంది ఐడియా?

జె. బి. ఆర్. సంగారెడ్డి.

పెద్దచదువు వుండి సంస్కారం లేని మనుష్యులను ఏమనాలి?

వాళ్ళ సంఖ్య ఎక్కువ. అంచేత ఏమీ అనకూడదు పాపం. అయినా మన విద్యారంగం చూస్తూ వుంటే చదువుకీ సంస్కారనికీ, చదువుకీ, తెలివికీ చదువుకీ సత్కారానికీ ఎటువంటి సంబంధంలేదని యిట్టే గ్రహించవచ్చు.

---

మాత్రం భరించలేదు. దీని పరిణామ మెలా వుంటుందో ననుకుంటూ యిల్లు జేరాడు.

భర్త కాళ్ళకునీళ్ళిచ్చి మంచినీళ్ళు తెచ్చింది ఆమె. చేతిలోని గ్లాసందుకుని ప్రమోద ముఖంలోకి చూసాడు.

"ఏమిటలా చూస్తున్నారు" అంది కళ్ళు క్రందికి వాల్చుకుని.

అందరికి స్ఫోటకం మచ్చలు వికారాన్నిస్తాయి. నీ కేమిటో క్రొత్త అందాన్ని తెచ్చి పెట్టాయని చూస్తున్నాను అన్నాడు ఆమె బుగ్గ మీద చిటిక వేసి.

"అబ్బ కొయ్యండి కోతలు, నా అందం తరిగిపోయిందని బాధ పడతానని నన్ను మభ్య పెట్టటాని కంటున్న మాటలని తెలుసుకోలేనంత అవివేకిని కాదు. కాని మీరనుకున్నట్లు నే నిపుడు బాధ పడటంలేదు సరికదా సంతోషిస్తున్నాన్న సంగతి మీరు గ్రహించాలి. ముఖంమీద ఈ గుంటలే కాదు. ఇంతకంటే

## మండుటెండ మంచిగంధం

పెద్ద ప్రమాద మేదైనా జరిగినా చింతించను."

"బాబు నిద్ర లేచాడు తీసుకోమ్మా" అంటూ లలితమ్మగారు పైకి వచ్చింది. ఆమె బుజాన వున్న బాబుని తీసుకుని "భోజనాలయ్యాయా పిన్నీ" అంది ప్రమోద.

"అయినాయమ్మా. అబ్బాయి వచ్చినట్లున్నారు ఇంటి దగ్గర అందరూ బాగున్నారటనా" అని అడిగి క్రిందకి వెళ్ళిపోయింది.

ఆశ్చర్యం నుండి తేరుకొని మోహన్ "ప్రేమూ! ప్రపంచంలో ఇది ఎన్నో వింత. జబ్బు చెయ్యటం మంచికే నంటున్నావు. ప్రమాదం జరిగినా బాధపడ నంటున్నావు. అన్నిటిని మించి లలితమ్మ గారిని పిన్నీ అంటూ ఇంత తియ్యగా పలుకరిస్తున్నావు. ఇదంతా నిజమా! నేను కలగంటున్నానా!" అన్నాడు మోహన్.

"నిజంగా నాకీ రోగం రావటం శిక్ష కాదండి వరం" ఈ జబ్బు చెయ్యకపోతే మీరు చెప్పిన మనసు యొక్క విలువలు నా కెప్పటికీ తెలిసేవి కావు. లలిత పిన్ని రూపం, వేసవికాలపు మండుటెండ అయితే ఆమె మనసు ఆ తాపాన్ని ఉపశమింప జేసే మంచి గంధం ఆ సంగతి నాకిన్నాళ్లకు గాని తెలియలేదు."

"అందుకే అంటారు అన్నీ మన మంచికే జరుగుతాయని. శరీరానికి సోకిన ఈ మసూచి నా మనసులోని మాలిన్యాన్ని కడిగివేసి మరీ వెళ్ళింది." అంటున్న ప్రమోదను అనురాగంతో, ఆత్మీయతతో, అన్నిటికన్నా ఆమెలోవచ్చిన మార్పుకు కలిగిన సంతృప్తితో దగ్గరకు తీసుకున్న మోహన్ గుండెలో అందంగా అమరి పోయింది ప్రమోద.

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**జి. ఎస్. పాలమనూరు**

మా వూరి దగ్గర గ్రామము నుండి పెండ్లి చూపులకి ఒకతను వచ్చాడు. ఆ సంబంధము అందరికీ సమ్మతమయింది. కాని మా బంధువులలో ఒకరు అతని అలవాట్లలో ఏదో లోపం ఒకసారి కనిపించిందని తెలిసింది. అతను పోస్ట్ మాస్టర్‌గా పనిచేస్తున్నాడు. చూడడానికి బాగానే ఉన్నాడు. ఇది కొందరికి సామాన్యమేనా?

ఒకరి గుణాన్ని ఒక్కసారి చూసి వెను వెనువెంటనే నిర్ధారణ చేయడం చాలా పొరపాటని ముందరగా తెలియజేయటం అవసరం. "అలవాటు" అంటే పదేపదే ఒక విషయాన్ని గురించి మాట్లాడడం, లేదా చేసిన పనినే చేస్తూ ఉండటం అని అర్థం. ఒకసారి ఏదో చూసినంత మాత్రాన "అలవాటని" ఎందుకనుకోవాలి? మనుషుల వ్యక్తిత్వానికి ఈ అలవాట్లే గీటురాళ్లయితే ప్రపంచంలో ఎవరికీ వివాహం కాదేమో! "తప్పులెన్నువారు తమ తప్పులెరుగరనే" సామెతగా, ఇంకొకరు ఎవరి గురించి ఏ ఆధారం లేకుండానే అపవాదు ప్రచారం చేస్తే ఎంత బాధపడతామో ఆలోచించి, అదే విధంగా అతనిని చూడటం మంచిది.

**జి. ఎస్. ఎస్. కె. శ్రీకాకుళం**

మా పెళ్లయి రెండు సం. లు అయినది. ఇంకా పిల్లలు లేరు. నాకు బుతుక్రమం ప్రతి 23–24 రోజులకే వస్తూంది. దీనికి ఏమైనా చికిత్స ఉన్నదా?

వివాహమయిన 3 సం. ల తర్వాత మాత్రమే సంతానం కలుగకపోతే ఆత్రుత పడవలసి ఉంటుంది. మీకు మరీ అంత తొందరగా ఉంటే ముందుగా మీ శ్రీవారిని వైద్యుల వద్ద సెమెన్ అనాలిసిస్ చేయించుకోమనండి. ఆయనలో ఏ లోపం లేకపోతే మీరు లేడీ డాక్టర్ల వద్ద పరీక్ష చేయించుకొని వారి సలహాపై "డి. అండ్ సి. "ట్యూబ్ టెస్టింగ్" మొదలయినవి చేయించుకోవటం మంచిది. ఈ పరీక్షల వల్ల కారణం తెలిసిపోతుంది గనుక దానికి, తగిన వైద్యం చేయించుకోవచ్చు.

**వి. ఆర్. సుంకర్రేవు**

నా వయస్సు 22 సం. లు. నా కుడి చేయి ఎముక భుజం వద్ద రెండు సార్లు "తప్పి" పోయి, కొద్ది క్షణాల తర్వాత దానంతటదే సర్దుకున్నది. ప్రస్తుతం చేయి పైకెత్తినా, దేనినైనా విసరినా 'భుజం' జారడం (తప్పడం) జరుగుతున్నది.

దీనిని ఆంగ్లంలో డిస్ లొకేషన్ ఆఫ్ షోల్డర్ అంటారు. ప్రతివారికి భుజం వద్ద నున్న కీళ్ల క్రింది భాగం (అంటే చంకల లోని పై భాగం) కండరాలు మొదలయినవి ఎక్కువగా లేని కారణం వల్ల బలహీనంగా ఉండటం సాధారణమైనదే! ఇలా, బలహీనంగా ఉండే కీళ్ల పటిష్టతకు ఆధారాలయిన కండరాలు మరింత బలహీనంగా తయారైతే, అడుగడుగునా, మీకు ఉన్నట్లే, చెయ్యి పైకి ఎత్తినప్పుడల్లా కీలు జారడం జరిగేఅవకాశం ఉన్నది. దాదాపు నెలకొకసారైనా ఇలా ఏర్పడుతూ ఉంటే, శస్త్రచికిత్స ద్వారా ఈ కీలుని పటిష్టం చేయవచ్చును.

**ఎస్. ఎస్. ఎస్.**

నా వయస్సు 17సం. లు నా కంటి రెప్ప పైన రెండు 'బుడిపెల' వలె వచ్చి కొన్ని నెలలు అయినది. డాక్టరు సలహాపై కొన్ని మందులు వాడాను. అయినా ఏమీ గుణము కనిపించలేదు. దీనికి నివారణోపాయం తెల్పండి.

కంటి రెప్పల మీద "బుడిపెల" వలె వచ్చి, కొన్ని మాసాలుగా, చికిత్సానంతరము కూడా ఉండటం "కలేజియాన్" అనే "రోగాన్ని" సూచిస్తుంది.

కంటి రెప్పలలో ఉన్న "మీ బొమియన్" గ్రంథుల నాళములలో మార్గావరోధం ఏర్పడటం వల్ల, ఈ గ్రంథుల నుంచి ఉత్పత్తి అయ్యేవి బహిర్గతమయ్యే మార్గం లేక పేరుకు పోవటమే ఈ "బుడిపెం"కి కారణం.

చిన్న శస్త్రచికిత్స ద్వారా వీటిని నేత్ర వైద్యులు సులభంగా తీసివేస్తారు. ఏ విధమైన ప్రమాదమూ ఈ ఆపరేషన్ వల్ల యిటు కంటికిగాని, అటు శరీరానికిగాని రావటానికి ఆస్కారంలేదు.

---

హాల్లోకి వచ్చిన మోహన్రావ్, అడుగులో అడుగు వేసుకుంటూ స్విచ్చిదగ్గరకు నడిచాడు. తటాలున స్విచ్చివేసి, చప్పుడు వస్తున్నదిశగా తుపాకి గురిపెట్టాడు.

అకస్మాత్తుగా ప్రసరించిన దీపకాంతికి, బీరువాలో దేనికోసమో వెతుకుతున్న జయరాం తల బైటపెట్టాడు. "అరే!" అన్నాడు లోగొంతుకలో ఆశ్చర్యంగా. దీపపుకాంతిని, అతడి కళ్లు ఒక్కక్షణం సరిగా చూడలేక పోయాయి. ఆ కాంతికి అతడి కళ్లు సర్దుకునేటప్పటికి, తనవేపు గురిపెట్టబడిన తుపాకి కనిపించింది. దాని వెనకనున్న మనిషి కూడా కనిపించాడు.

"హల్లో! సార్! రండి, రండి! ఏమిటిలా వచ్చేశారు, యిలాంటప్పుడు?" అనడిగాడు జయరాం. ఇలాటి సమయాల్లో కాస్త స్నేహపూర్వకంగా మాట్లాడడం అవసరమని గుర్తించాడు.

"ఏం చేస్తున్నావిక్కడ?" ఉరుములాగా

## చరకసంహిత

(18వ పేజీ తరువాయి)

ధ్వనించాడు డాక్టరు.

"ఊరికే ఏం తోచక అలా వచ్చానంతే!" అన్నాడు జయరాం ప్రక్కకివచ్చి కుర్చీలో కూర్చుంటూ.

"బలుసాకు తినదలచుకుంటే చెప్పు. ఎందుకు వచ్చావు ఇక్కడికి? ఏమిటి చేస్తున్నావిక్కడ?"

"బలుసాకా? అది అంతరుచిగా వుంటుందనుకోను ... అన్నట్టు మరిచిపోయాను! మీతో నేను జరిపిన యింటర్వ్యూ గురించి కొన్ని విషయాలు మాట్లాడాలి. మీరు యిప్పుడు తీరికవుంటే కూర్చోండి. చిన్న బాతాఖానీవేద్దాం!" అన్నాడు జయరాం.

"మూడు నిమిషాలు టైమిస్తున్నాను!.. నీ సంగతి నాకు మొదట్నించీ అనుమానంగానే వుంది... అంతలోపల చెప్పకపోయావా, ఈ లోకంలో నీకు నూకలు చెల్లిపోతాయి!"

జయరాం నవ్వేశాడు. "భలేవారు సార్ మీరు! చాలా తమాషాగా మాట్లాడుతారు సుమా!! ఆ రోజు మీకు రొంపపట్టినప్పుడు..." జయరాం తలవంచుకుని కడుపు పట్టుకుని నవ్వాడు "...అహ్హహ్హా... నాకు తలచుకుంటే యిప్పటికీ నవ్వొస్తుంది ... ఎర్రగా, మీముక్కూ మీరూ... మీ ఫోటో తీసి, పేపర్లోవేస్తే బాగుంటుందనికూడా అనుకున్నాను తెలుసా!" అన్నాడు. నవ్వులో ఎంతటి కఠినుణ్ణి అయినా కరిగించగల శక్తి వుందని అతడి నమ్మకం.

"ఇదిగో ఎంచుతున్నాను. ఒకటే!" భయంకరంగావుందా గొంతు.

"అదేమిటి! మీరు నిజంగానే అలాగా మాటాడుతున్నారా? నేన్నమ్మను!! ఏదో సర్దాకంటున్నారనుకుంటాను ... అతిథులనీ, అభ్యాగతులనీ ఆదరించేవాడని పేరుగన్న మోహనరావు, ఇలాగా వాళ్లని భయపెడ్తాడని

ఎలాగ నమ్మడం? . ఇక చాల్లెండిసార్! హాస్యానికైనా ఒక హద్దంటూ వుండాలి ఆ తుపాకి పక్కనపెట్టి యిటు వచ్చి కూర్చోండి! ముఖ్యమైన విషయాలు మీతో చర్చించాలి!"

"రెండు!"

"సార్! సార్!" అని బయటినుంచి కేక వినిపించింది వెంటనె వాసు పరుగెత్తు కుంటూ లోపలికి వచ్చాడు మోహన్రావు తలతిప్పి అతణ్ని చూశాడు అతడి చేతిలో ఒక పుస్తకముంది!

"సార్, సార్! ఇదుగో మీ పుస్తకం! పోలేదు! అది దొరికింది! నాకు దొరికింది! వీడు నా మిత్రుడు జయరాం! వాణ్ణి వది లెయ్యండి!" అన్నాడు వాసు

డాక్టరు మొహం కోపంతో వివర్ణ మయింది "ఓ, ఇది నీ పనా? నువ్వా.. ఓ, అర్థమైంది ఆరోజు విచిత్రమైన పరిస్థితుల్లో నా దగ్గర పనికి చేరినప్పుడే నేను నిన్ను అనుమానించవలసింది అనుమానించేవాడినే కాని ఫూల్ లాగ మా అమ్మాయి చెప్పిన మాటల్ని విని, నిన్ను నా దగ్గర చేర్చుకున్నాను సరే, మించి పోయిందేంలేదు! ఆ పుస్తకం, నేను చెమటోడ్చి, కష్టించి రాసిన పుస్తకం — నా ప్రాణాలన్నీ దానిపైనే వుంచుకున్న పుస్తకం — దొంగిలించడానికి, మీకెన్ని గుండెల్రా? దాన్ని ఆ బల్ల మీద వుంచి, వాడి ముందు వెళ్లి నిలుచో! ఒక దెబ్బకి రెండు పిట్టలు! మీ యిద్దర్నీ భగవంతుడి దగ్గరికి పంపిస్తాను ఊఁ! కదులు చేతులు పైకెత్తు!" అన్నాడు.

# చరకసంహిత

వాసు పుస్తకాన్ని పడేసి చేతులు పైకెత్తాడు "నిజం సార్! నా మాట నమ్మండి! ఈ పుస్తకం నేను దొంగతనం చెయ్యలేదు నాకా వుద్దేశ్యం కూడా లేదు! నేను గంట క్రిందట గదిలో ఏదో చప్పుడు విని కాంపౌండులోకి వెళ్లాను అక్కడ ఒక పొదలో దాక్కున్నాను ఎవరేనా వస్తె ఏం చేస్తున్నారో గమనిద్దామని ఇంతలో ఒకడింట్లో నుంచి వచ్చాడు ఇంకొకడు బయటి నుంచి వచ్చాడు వాళ్లిద్దరూ పోట్లాడుకున్నారు అంతలో ఏదో క్రింద పడింది ఏమిటని చూద్దును గదా, అదొక పుస్తకం మీ పుస్తకం వెంటనే దాన్ని తీసుకుని, దాచేసుకుని వచ్చేశాను ఉదయానే దీన్ని మీకు అప్పచెబుదామని నా వుద్దేశం . ఇంతలో "

"చాలించు, నీ వాగుడు! మీ రిద్దరూ దేవుణ్ని తలచుకోండి! మీరు చెసిన పాపాల్ని క్షమించి, యీ ఆఖరు క్షణంలో తనని తలచుకున్నందుకు పుణ్య లోకాల్ని కలిగిస్తాడు . రెడీ? వన్!" అన్నాడు మోహన్రావ్

"సార్, నా మాట వినండి!" అన్నాడు వాసు

"టూ!" అన్నాడు

"ఏమిటి నాన్నా? ఏంటా చప్పుడు " అంటూ కళ్లు నులుముకుంటూ వసుంధర ప్రవేశించింది హటాత్తుగా చేతులెత్తి నిలచున్న వాసునీ, తుపాకి అతనికేసి గురిపెట్టి నిలుచున్న డాక్టరునీచూసి ఆశ్చర్యంతో

"అయ్యో! ఏమిటి?" అనడిగింది

తొందర తొందరగా వున్న పరిస్థితిని వివరించాడు వాసు, తనని ఎందుకు డాక్టరు అనుమానిస్తున్నాడో అర్థంగాక దిగులుపడి వున్నాడు

"నాన్నా! వాసు నిర్దోషి! అతణ్ణి వదిలెయ్!" అంది వసుంధర

"పూర్కొమ్మా! నీకు తెలియదు! అసలు నీ మాట వినే ముందు మోస పోయాను ఇప్పుడిక నా చేతిలోనుంచి తప్పించుకోలేరు వీళ్లు ఊఁ! కానీండి కళ్లు మూసుకుని మిమ్మల్ని సృష్టించిన దేవుణ్ణి తలచుకొండి! త్వరగా వన్!"

"నాన్నా!" సివంగిలా అరిచింది వసుంధర "మనిషి రక్తం రుచిచూసిన పులిలా పులుల రక్తం చవిచూశావు! ఇప్పుడు మనిషి రక్తాన్నే రుచిచూడాలనుకుంటే కానీయ్! ఇద్దర్ని చంపి నీ రక్తదాహం తీర్చుకో!" అంది వాసు దగ్గరికి వచ్చి నిలబడుతూ

"వెనక యింకొకడున్నాడు వసూ! మిత్రుడు జయరాం!" అన్నాడు వాసు

"అయితే ముగ్గుర్నీ చంపి నీ రక్తదాహం తీర్చుకో!" అంది వసుంధర

"నువ్వు లేమ్మా! వాళ్లిద్దర్నీ యివాళ వదిలేదిలేదు! అన్నాడు డాక్టరు

"లేదు నాన్నా! వాసుతోడిదే నా జీవితం జీవించినా అతడితోనే జీవిస్తాను, మరణించినా అతడితోనే!"

"అంటే?" అర్థం కానట్టు అడిగాడు డాక్టరు

"అంటే ఏముంది? మేం పెళ్లి చేసుకుందామనుకున్నాం నిన్ను మెప్పించి, నీ మెప్పుదల సంపాదించాలని, నేనే వాసుని నీ దగ్గర చేరమన్నాను నువ్విప్పుడు అతణ్ణి శంకిస్తున్నావ్ అతడి ప్రాణాలు తియ్యడానికి కూడా సిద్ధమవుతున్నావ్!! కానీ, అలాగే నన్నూ అతడితోపాటే పంపించెయ్ నీపని సులువవుతుంది!" అంది "మేం చచ్చి పోతాం!" అని ఏడ్చేసింది

"బుద్ధి లేకుండా మాట్లాడకు! పక్కకి రా!" అని మోహన్రావు ఆమె దగ్గరికి వచ్చి, నిర్దాక్షిణ్యంగా రెక్క పట్టుకుని ఆమెని పక్కకి లాగేశాడు "ఊఁ! కానీండి! తలచుకోండి మీ దేవుణ్ణి తలచుకోండి! ఇప్పటికే ఆలస్య మయింది! వన్ టూ! " తుపాకి కంటిదగ్గర వుంచి గురిచూస్తున్నాడు



"ఆగు!" అని అరిచిందొక కంఠం వెలుపలి నుంచి

మోహన్రావు తుపాకి దించి పక్కకి చూశాడు పరంధాం ఏవో పుస్తకాలు పట్టుకుని లోపలికొస్తున్నాడు

"ఆగు!" అన్నాడు పరంధాం మళ్లీ "ముందుగా నువ్వు నా ప్రశ్నలకి జవాబు చెప్పు! తర్వాత మిగతా విషయాలు ఆలోచిద్దాం!" అన్నాడు కోపంగా పరంధాం

"ఓ నువ్వా! వైద్య సమితినుంచి వచ్చిన వ్యక్తివా? ఏం యింకా ఢిల్లీకి వెళ్లలా? లేక నువ్వూ వీళ్లతోపాటు పైకి వెళ్లదలుచుకున్నావా?" అన్నాడు మోహన్రావ్

"ఎవరు వాళ్లూ?" అని వాళ్లవేపు చూశాడు పరంధాం వెంటనే "జాగ్రత్త అందులో ఒకడు నా తమ్ముడు వాడికేమైనా అపకారం జరిగిందంటే నీ రక్తం కళ్ల జూస్తాను!" అనరిచాడు పరంధాం

"ఎవడు నీ తమ్ముడు? ఓ, ఆ పేపరువాడా? పాపం,వాడికి పోర్షన్ అయిపోయింది. విశ్రమిస్తున్నాడు!" అన్నాడు డాక్టరు

"ముందు నా ప్రశ్నలకి జవాబు చెప్పకపోతే, నీపని నేను చూస్తాను ఇదిగో యీ పుస్తకాలు చూశావా?" అన్నాడు పరంధాం అటుచూసి

"అవి, అవి అని నీకెలా వచ్చాయి! ఎందుకు తీశావు? " తడబడుతూ అన్నాడు డాక్టరు కర్కశంగా మాటాడాలనుకున్నా తొట్రుబాటు తెలుస్తూనే వుంది

"ఎలావచ్చాయి? బజారులో పడివుంటే తీసుకున్నా సరా? లేకుంటే ఏంవిటా వెధవ ప్రశ్న — నేను వీటికోసమే వెతుకుతున్నానోయ్, చవలాయ్!" అన్నాడు పరంధాం

"వెతుకుతున్నావా? ఆంటె? అంటే?" విషయమేమీ బోధపడని వాడిలాగా తికమకగా అడిగాడు డాక్టరు

"డాక్టరు రాధారమణ్ తెలుసునా?" అనడిగాడు పరంధాం

కెప్టెన్ చేతిలో నుంచి తుపాకి జారి క్రిందికి పడిపోయింది "డాక్టర! రాధారమణ్ రాధారమణ్!" ఏదో లోకంలోంచి మాటాడుతున్నట్టు అన్నాడు మోహనరావు

"ఏం గుర్తులేదా? చాలాకాలం లయింది కదూ!! నీ పేరు వినగానే నిన్ను అనుమానించాను ఇంత దగ్గరలో వుండి కూడా,




ఇంతకాలం నీ సంగతి తెలియకుండా ఎలా వున్నావన్నది నా కర్థం గావడంలేదు! సరే! నీపై అనుమానం కలగగానే, నీ సంగతి తెలుసుకోవాలనె వచ్చాను కొన్ని ప్రశ్నలువేసి నీ గత చరిత్ర తెలుసు కుందామనె వచ్చాను కాని నువ్వు నాకు ఆ అవకాశం యివ్వలేదు అందుకే యీ రాత్రి వచ్చి, తాళాల సహాయంతో, నీ హాలు తలుపులు తెరిచి పరిశోధన కొనసాగించాను నాకు దొరకవలసిన మూడు పుస్తకాలూ దొరికినాయి బయటికి వెళ్లుతుండగా చీకటిలో ఎవడో వచ్చి నాకుతగిలాడు ఒక పుస్తకం కిందపడిపోయింది"

"అవును! నాకూ ఎవడో తగిలాడు!. అంటే? అంటే! ఒకరి కొకరు తగిలింది మనమేనన్నమాట!" అన్నాడు జయరాం వాసు వెనక నించి కాంతిలేని కళ్లతో మోహన్రావు అతడివంక చూశాడు

నిశ్శబ్దవన్నట్టు చెయ్యి ఎత్తాడు పరంధాం "సరే! పోతేపోయింది నాకు కావలసిన పుస్తకాలు రెండూ దొరికాయి. గదికి వెళ్ళి వాటిని పరిశీలించాను నాకు పూర్తిగా ఋజువులు దొరికాయి వెంటనే నీ సంగతి తేల్చుకుందామని వచ్చాను నువ్వేదో యిక్కడ డ్రామా నడుపుతున్నావు ఇప్పుడు చెప్పు మా బాబాయిగారి కొడుకెక్కడ?"

"మి బాబాయిగారి కొడుకా? అంటె మి తమ్ముడా?" నూతిలోని గొంతుకలాగా వినిపించింది కెప్టెన్ స్వరం

"అవును, మా తమ్ముడే! అర్థం కాలేదు కదూ! సరే విను! డాక్టరు రాధారమణ్ మా బాబాయి, మా బాబాయి రాసిన వైద్య గ్రంథం నీ దగ్గర వుండడాన్నిబట్టీ, నీ డైరీచూట్టే, నువ్వు మా బాబాయికి ఎరిగున్నవాడివని ఋజువైంది మా బాబాయి చెప్పినదాన్నిబట్టి, మా తమ్ముడు రాజారాం నీ దగ్గర వుండాలి వాణ్ణి ఏంచేశావో చెప్పు, లేకుంటె, నీ కథ యింతటితో ముగిసేది కాదు!" బెదిరించే ధోరణిలో అన్నాడు పరంధాం

కెప్టెన్ గబగబా అతడి దగ్గరకు వచ్చాడు. అతడి చేతులు పట్టుకుంటూ "బాబ్బాబు! నన్ను క్షమించు! నువ్వన్నట్టు డాక్టరుగారూ, నేనూ మంచి మిత్రులమే! ఆయన రాసిన వైద్యగ్రంథం నువ్వన్నట్టు ఆయనే నాకు స్వయంగా యిచ్చాడు అది ఎంతో గొప్ప గ్రంథం ఎన్నెన్నో చికిత్సా విధానాలు, చివరికి యిళ్లలో అమ్మమ్మలు వాడే చిట్కాలతో సహా సేకరించి, వ్రాసి వుంచాడాయన ఆ పుస్తకం అంటే నాకు ప్రాణ సమానం. ఎప్పుడూ దాన్ని చదువుతుండేవాడిని ఆయన వ్రాసిన ఎన్నో విధానాలను వాడిచూసి, ఆయన వ్రాసిన ప్రతి అక్షరమూ సత్యమని తెలుసుకున్న వాడిని ఆయనంటే నాకెంతో గౌరవం అయితె ఆయనకి నేను ఎంత క్షోభ కలిగించానో నాకు తెలుసు ఆయనకి మొహం చూపలేకనే నేను మిలటరీలో చేరాను ఈ జన్మకి ఆయనకి జవాబు చెప్పే అవసరం రాదనే అనుకున్నాను అయినా నా పాపం ఎప్పుడో ఒకసారి బద్దలవుతుందని నాకు తెలుసు!" అన్నాడు

"అదిసరే! మా బాబాయిగారి అబ్బాయి గురించి చెప్పు!"

"ఏం చెప్పేది? ఆరోజులు భయంకరమైనవి మేం వున్న వూరిమీద బాంబులు పడతాయని అనుకున్నారు వూరంతా తరలి వెళ్ళిపోతున్నారు సురక్షితమైన ప్రదేశాలకి మీ బాబాయిగారు తను రాసిన వైద్యగ్రంథాన్ని, మీ తమ్ముణ్ణి నాతో వదలివెళ్ళిపోయారు ... అందుకు కారణం మరేమీలేదు గ్రంథం నేనెప్పుడూ చదువు తుండడం ఇక, మీ తమ్ముడు మా యింట్లో ఆడుకుంటూ, వాళ్లతో వెళ్లనని మొండికెయ్యడం. వాళ్ళు

# చరక సంహిత

చాలా తొందరలోవున్నారు నిజానికి రోజుల లాటివి ఎవరికి వీలయిన రీతిని వాళ్ళ ప్రయాణాలు సాగిస్తున్నారు మీ తమ్ముణ్ణి నేను నావెంట తీసుకుని వస్తానని మీ బాబాయికి చెప్పాను కాని నా డిస్పెన్సరీలో సామానంతా బండ్లకి ఎక్కించి, నేను బయలుదేరే టప్పటికి చీకటిపడింది నా భార్యకి ఆ సాయంత్రంనుంచీ, ఆరోగ్యం చెడిపోయింది నేను ప్రయాణానికి సిద్ధమై యింటికి వచ్చే టప్పటికి ఒంటిమీద స్పృహలేదు మందు లిచ్చాను, ఒక అరగంట ప్రయాణం వాయిదా వేసుకున్నాను జ్వరం తగ్గుముఖం పట్టే సూచనలు కనబడలేదు ఇంకా ఆలస్యం చెయ్యడం అవివేకం అని, ఆమెని డ్రైవరు సహాయంతో కారులో పడుకోపెట్టి, నేనామె ప్రక్కనే కూర్చొని, కారు పోనిమ్మన్నాను కారు వెళుతోంటే, మీ బాబాయిగారి వైద్య గ్రంథంలో, యీ రకమైన జ్వరానికి చికిత్సా విధానం ఎలావుందోనని చదువుతూ వుండి పోయాను ఒక యిరవై మైళ్ళు వచ్చాక గాని కారులో మీ బాబాయిగా రబ్బాయి లేడనే విషయం తెలియలేదు కారు బయలు దేరే ముందే ఆ అబ్బాయిని కారు ముందు సీట్లో కూర్చోపెట్టాను కారు బయలుదేరుతున్న ప్పుడు చూసుకోవలసింది చూసుకోవల సింది కాని చూసుకోలేదు వాడు మీ రాజారాం కారు బయలుదేరడానికి ముందుగానే దిగిపోయినా డనుకుంటాను డ్రైవర్ని కూకలేశాను ఎన్ననీ ఏం ప్రయోజనం? అంత ప్రమాదకరమైన రోజులైనా, నా భార్య అంత అనారోగ్య స్థితిలో వున్నా కారుని వెనకకి తిప్పించాను మా యింటి చుట్టుపక్కలంతా వెతికాము కనిపించిన వాళ్ళనందరినీ అడిగాము కానీ ఎవరేం చెప్పగల్గరు? ఎవరి గొడవలో వాళ్ళు ఎవరి తొందరలో వాళ్ళు ఎక్కడో తప్పి పోయాడన్నది రూఢి అయింది వాణ్ణి పట్టుకోడంకూడా ఆ రోజుల్లో కష్టమే ముఖ్యంగా మీ బాబాయికి ఏం చెప్పుకునేది? ఆయనకి నా మొహాన్ని ఎలా చూపించేది? ధైర్యం చాలలేదు ఇన్ని పులుల్ని చంపగల్గినవాణ్ణి, ధైర్యం చాలలేదు ఒక మనిషి ఎదుటపడడానికి! పారిపోయి మిలటరీలో చేరాను ఎన్నో దేశాలు తిరిగాను! మా వసుంధర విదేశాల్లో జన్మించింది నేను గాజాలో పనిచేస్తుండగా పుట్టింది నన్ను క్షమించు! ఇంతకు మించి నాకేమీ తెలియదు!'' అన్నాడు మోహన్‌రావ్, అలసిపోయినట్టయిపోయి, నిస్సత్తువుగా కూలబడి పోయాడు

'' మిగిలింది నాకు తెలిసినంతవరకూ చెప్తాను!'' అన్నాడు వాసు

''ఆ పుత్రవాడు కారు బయలుదేరడానికి చాలా ముందుగానే కారు దిగిపోయాడు ఆడుకుంటూ, ఆడుకుంటూ, రెండు వీధు లలా అరిగాడు చివరికి దారితప్పిపోయి ఏడ్చుకుంటూ నిలబడ్డాడు. తర్వాత ఎవరో వాడిపై దయదలచి బండిమీద ఎక్కించుకొని తీసుకెళ్ళారు పల్లెటూరులాగుంది తర్వాత ఏమయిందో సరిగా తెలియదు అక్కడా, అక్కడా వున్నట్టున్నాడు చివరికి యీ వూరికి వచ్చిచేరాడు''

''యీ వూరికా! ఏడీ, ఏడీ, ఎక్కడున్నాడు?'' అనడిగాడు పరంధాం

''ఇదుగో యిక్కడే వున్నాడు!'' అన్నాడు వాసు తనని తాను చూపుకుంటూ

''నువ్వా?!!'' అన్నారు డాక్టరు తలతిప్పి ఆశ్చర్యంగా అతడికేసి చూస్తూ

''నువ్వా?!'' అన్నాడు పరంధాం

''నువ్వా?'' అన్నాడు జయరాం

'నువ్వా!' అన్నది వసుంధర ఆశ్చర్యంలో

''అవును, నేనే! నాకు మొదటేనుంచీ అనుమానంగానే వుంది, నాకు యింకొక పేరేదో వుందని! అది నిజమని రుజువయిందిప్పుడు!'' అన్నాడు వాసు

''తమ్ముడూ! రాజారాం!'' అన్నాడు పరంధాం, వాసుని కౌగలించుకుంటూ

''ఒరే కుంకా! నువ్వు రాజారాంవట్రా, మై డియర్ వెర్రివాగన్నా!'' అన్నాడు జయరాం వాసు చేతిని పుచ్చుకుంటూ

''చూశావా వసూ! నేను ఒంటరివాణ్ణి కాదు! నాకు అందరూ వున్నారు! చూశావా! చూశావా!'' అన్నాడు వాసు

''అవును వాసూ! నాకెంతో సంతోషంగా వుంది!! ఎంత సంతోషంగా వుందో చెప్పలేను నేను!'' అంది ఆనందంలో వసుంధర

''ఒరే రాజా! మీ నాన్న ఆస్తంతా నేనే మేనేజ్ చేస్తున్నాను మీ చెల్లి కూడా నా దగ్గరే వుంటోంది ఈ రెండు బాధ్యతలూ నీ నెత్తికెత్తితే నేనే విశ్రాంతిగా వుండొచ్చురా! ఏం?'' అన్నాడు పరంధాం

''అవునవును! అప్పటికిగాని కుదటపడ్డం తెలియదు అయ్యగార్కి!'' అంది వసుంధర వెక్కిరిస్తూ

''హోయస్! అన్నయ్యా! నీ కెలా థాంక్స్ చెప్పాలో తెలియడంలేదు!'' అన్నాడు వాసు

''థాంక్సేమిట్రా, చవటా!... అన్నట్టు మరిచేపోయాను మీ నాన్న రాసిన గ్రంథాన్ని నేను ప్రచురించాను ఎక్కువ కొనుగోళ్ళు లేవనుకో అయినా ఆ గ్రంథం తాలూకు రాబడి అంతా నీకే చెందుతుంది అది ఎలా మేనేజ్ చేసుకుంటావో, అదీ నా బాధ్యతే!''

''చూశావా వసూ! నాకు బాధ్యతలు ఎలా



పెరిగిపోతున్నాయో నిమిష నిమిషానికీ!"

"నీకు కావలసిందేలే ఆ శాస్తి!! ఇన్నాళ్లు బలాదూర్ తిరిగావా!" అంది వసుంధర.

"బాబూ! నన్ను క్షమించాననండి... నేను తెలిసి చేసినా తెలియక చేసినా...తప్పు తప్పే!" అన్నాడు పరంధాంవేపు తిరిగి కెప్టెన్.

"అయ్యా! ఈ సంతోష సమయంలో తప్పులూ, క్షమాపణలూ ఏమిటండీ! కలలో కూడా వూహించని సంఘటన జరిగింది... ఎన్నడో తప్పిపోయిన మా రాజు దొరికాడు... ఇంతకు మించిన నాకు యింకేం కావాలండీ!—ఇదిగో మీ డైరీ, యిదిగో మా బాబాయి రాసిన వైద్య గ్రంధం... దీంట్లోని మీకు కావలసినంత మేటరు వుపయోగించుకుని, మీ వైద్య గ్రంధాన్ని పూర్తిచేసుకోండి... నాకేం అభ్యంతరం లేదు! ఇది రాజుకి సంబంధించినది... వాడికే ఏమైనా అభ్యంతరముంటే!" అన్నాడు పరంధాం.

'నాకేం అభ్యంతరంలేదు!" అన్నాడువాసు.

"అయ్యా! ఆ గ్రంథాన్ని నాకిచ్చెయ్యండి! నా పత్రికలో సీరియల్‌గా వేసుకుంటాను!" అన్నాడు జయరాం.

"అలాగే బాబూ! అలాగే!" డాక్టరు వొప్పుకున్నాడు.

"ఒరే రాజూ! వెళ్దాం పద!" అన్నాడు పరంధాం.

"అన్నయ్యా! నేను వాసుగానే పెరిగాను. వాసుగానే వుంటాను.ఏమంటావు వసూ!"

"వాసుగానే వుండు వాసూ!" అంది వసుంధర.

"ఒరే కుంకా! వాసుగానే వుండరా! నీతి రత్నాకరంలో సుమతీశతకకారుడన్నట్టు పేరులోన నేమి పెన్నిధి యున్నది? తాడి చెట్టుని ఏ పేరుతో పిలిస్తేనేం?" అన్నాడు జయరాం.

"అన్నట్టు, డాక్టరుగారూ! ఈ సమయంలో మీరు ఏమాత్రం బాధపడకుండా, ఒక ఒప్పందం చేసుకుందాం! ఏమంటారూ? మీ కిష్టమేనా?"

"ఏమిటదీ?"

"అదే! మా రాజుగాడికి—అంటే వాసుకి—మీ అమ్మాయినిచ్చి పెళ్లి చెయ్యండి!...ఏం వొప్పుకుంటారా, లేక..."

"నాకేం అభ్యంతరంలేదు... నాకంతా యిప్పుడు నిశ్చింతగా వుంది!"అన్నాడుడాక్టరు.

"అయితే యింకేం! శుభమస్తు!" అన్నాడు పరంధాం. (అయిపోయింది)

# ఫాలాక్షుని డైరీ

## లంచం ఫలితం

ఒక తన్నులాట కేసును మాఫీ చేయడానికి పొన్నూరు గ్రామానికి చెందిన సబ్ ఇన్‌స్పెక్టరు (పోలీస్) సూర్యనారాయణన్ కొంత దక్షిణ పుచ్చుకున్నాడట. ఈ విషయం తెలిసిన అవినీతి నిరోధక శాఖ పటాలం ఆయన ఇల్లు సోదా చేస్తే 543 రూపాయలు దొరికాయట. అంతేగాక కాలీకాలని నోట్లు మరికొన్ని కనిపించాయట. అదీగాక బీరు సీసా కూడా కనిపించిందట. తత్ఫలితంగా దక్షిణ పుచ్చుకున్న యస్సైగారిని కూడా పట్టుకుని జెయిల్లో ఉంచారట.

## 50 లక్షల ఆడిటోరియం పేరుమార్పు!

తిరుచ్చిలో యాభయి లక్షల ఖర్చులతో నిర్మిస్తున్న ఓ ఆడిటోరియం (నాటకాలు, సమావేశాలూ జరుపుకోడానికి అనువైన హాలు అనవచ్చు) ముందు తెల్ల చలువరాతి ఫలకంమీద "కరుణానిధి కళయు అరంగమ్" అన్న పేరు చెక్కారట ఆ భవనానికి ఆయన పేరు పెడుతూ. ఆ ఫలకాన్ని ఫిబ్రవరి 25వ తేదీన తీసివేశారట—ఏంవేశారు!

## కుటుంబనియంత్రణ పార్టీసభ్యుల బాధ్యత

ఇద్దరు పిల్లలకంటే మంత్రులుకూడా ఎక్కువమందిని కలిగి వుండరాదని, తమ కుటుంబాన్ని ఇద్దరు సంతానంలో పరిమితంచేసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వోద్యోగులకేగాక, కాంగ్రెసు పార్టీ సభ్యులకు కూడా కలదట. ఈ విషయం మిస్టర్ శశిభూషన్ భోపాల్లో అన్నరట.

# ఫాల్గుణి డైరీ

## పాపం పండకుండునా?

తిరునల్వేలికి చెందిన 40 ఏళ్ళ చిన్నతంబి అనే అభినవ యుగంధరుడు మదరాసులో డాక్టర్ ఆర్ వి కె సహాయంగా తన పేరు మార్చుకొని, తాంబరంలో ఓ పెద్ద ఇల్లు తీసుకుని స్థిరపడ్డాడట ఆనక తమిళ దినపత్రికలలో తానో మిషినరీ ధనసహాయంతో దేశంలో అన్ని చోట్లలోనూ బ్రాంచీలుండే పెద్ద ఆసుపత్రి ప్రారంభించ నున్నట్లు ప్రకటిస్తూ, డాక్టర్లూ, కాంపౌండర్లూ, నర్సులూ, వగైరాలు కావలెను అని కోరాడట ఊహించిన మేరకు దరఖాస్తు ఫారాలు వచ్చాయట ఆయా పోస్టులను బట్టి ఎన్నిక చేసుకుని వెయ్యి నుంచి నాలుగు వేల వరకూ డిపాజిట్లు ఒక్కొక్కరి చేత కట్టించుకుని వాళ్ళకు ఆర్డర్లు కూడా టైపు చేయించి ఫలానా ఫలానా ఊళ్ళల్లో మీరో నెల తరువాత చేర వచ్చును అని చెప్పి పంపేశాడట అంతేగాక తాంబరం ప్రాంతంలో తనకొచ్చిన పలుకుబడిని ఉపయోగించుకుని ముందు తారీఖు వేసిన చెక్కులు ఇచ్చుకుంటూ చాలా సరుకులు, సరంజామాలు కూడా కొనేశాడట ఈ విధంగా ఆయన అతి వేగంగా ఓ లకారానికి చేరిపోతున్న సమయంలో సుడి తిరిగిందట ఓ వ్యాపారికి ముందు తారీఖు చెక్కు ఇచ్చి సరుకు తీసేసుకున్నాక ఆ వ్యాపారి పొరపాటున ఆ చెక్కు బ్యాంకులో వేశాడట అది తెల్లమొఖం వేసి తిరిగొచ్చిందట దాంతో అతను అనుమానంతో పోలీసులకు చెప్తే వాళ్ళొచ్చి ఆ సహాం గారిని అటకాయించేసరికి ఆయన తెల్లమొఖం వేసి తెల్లబోయి, బుకాయించాడట కానీ పోలీసు ఇన్‌స్పెక్టరు గురుపాదం ఆ సహాయం ముసుగులోని గమనించి, టక్కున ఆయన్నరెస్టు చెయ్యబోయేసరికి కథంతా ఒప్పేసుకున్నాడట

## పూజా ఫలమా?

ధారాపురానికి చెందిన రంగస్వామినాయకర్ మనుమరాలు 20 ఏళ్ల ధనం పూజాముదిరంలో దేవునికి సాష్టాంగ నమస్కారాలు చేసుకుంటూ మొక్కుకుంటున్న సందర్భంలో ఆమె చీరకు దేవుని దీపం మంటంటుకుని గప్పున ఒళ్ళంతా కాలి, సహాయం అందేలోగానే ఆమె చనిపోయిందిట

## భారతీయునికి ప్రప్రథమంగా ప్రపంచ కోర్టులో ఉపాధ్యక్ష పదవి

వరల్డ్‌కోర్టు జడ్జీల ఎన్నికలలో హేగ్‌లో డాక్టరు నగేంద్రసింగ్ అనే భారతీయుణ్ణి కోర్టు వైస్‌ప్రసిడెంటుగా ఎన్నుకున్నారట ఈస్థాయిలో భారతీయుడు గౌరవించబడడం ఇదే మొట్టమొదటిసారిట ఇంటర్నేషనల్‌కోర్టు ఆఫ్‌జస్టిస్‌లో ఇంతకుముందు ఈయన జడ్జీగా వుండేవారట

# హైదరాబాద్ నోట్‌బుక్

(8వ పేజీ తరువాయి)

వాణి విజయవాడ కేంద్రం లలిత సంగీత దర్శకులు మిత్రులు శ్రీ మల్లిక్ సన్నివేశానుగుణమైన సంగీతం జతపరిచారు ఈ త్రివేణి సంగమం “నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం” అని కాళిదాసు అన్నట్లు ఆ పండిత పామరం సమారాధనమయింది ఈ బృందంలోని పలువురు వివిధ దేశాలలో తమ నృత్య కౌశలానికి ప్రశంసలుపొందినవారు కుమారి కె శోభానాయుడు రంగస్థలానికి, కూచిపూడి సంప్రదాయానికి గొప్ప శోభగా నేను భావిస్తున్నాను ప్రతి నర్తకి తన పాత్రను అద్భుతంగా నిర్వహించింది తల్లి మాయి పాత్రధారిణి శ్రీమతి దుర్గ మాయా నృత్యం ఒళ్ళు జలదరించేట్టుంది శోభానాయుడు ప్రతి విన్యాసం ప్రతి అభినయం, ప్రతి చూపు కళామయం, ప్రతి హొయలు, ప్రతి అడుగు కళామయం ఆమెను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను ఫ్రాన్సు నుంచి వచ్చి, మద్రాసులో శ్రీ వెంపటి చినసత్యం వద్ద కూచిపూడి నృత్యం నేర్చుకుంటున్న కుమారిలోరాను ప్రత్యేకంగా అభినందించాలి

మిత్రులు భుజంగరాయశర్మను పదేళ్ళక్రితం చూచాను ‘కొత్త రచనలేమైనా చేశారా?’’ అని మొన్న ప్రశ్నించాను ఆయన మందహాసం చేశారు, చూస్తూరుగా సాయంకాలం అన్నట్టు సాయంకాలం చూచాను. సహృదయుల హృదయానికి సంఘప్రయోజనానికి సమానంగా కాంతినిచ్చే రచనకు ముగ్ధుడనై పోయాను ఇలాటిది పదేళ్లకొకటి పట్టుమని ఒకటి వ్రాసినా చాలనిపించింది కళ కళకోసమన్నది భారతీయ సిద్ధాంత మెప్పుడూ కాదు దానికి దేశమంతా ఆగ్నేయాసియా అంతా అల్లిబిల్లిగా అల్లుకున్న భారతీయ కళారీతే లాక్షణం సంఘోన్నతికి దోహదకరమైన ‘చండాలిక’ ను రచించిన భుజంగరాయ శర్మను నృత్య రీతులలో ఈ ఆనంద ప్రాత నిర్వహణతోను దానికిఆబాలగోపాల రంజకత్వం కల్పించిన మిత్రులు శ్రీ చినసత్యంను, సంగీతంతో మనస్సును పల్లవింపజేసిన చిరకాల మిత్రులు మల్లిక్‌ను ఈ మూడింటికి శోభను కూర్చిన కుమారి శోభానాయుడును మరొకమారు అభినందించకుండా ఉండలేక పోతున్నాను

## ఉపశ్రుతి

“బిర్లామందిరం గురించి అంతగా వ్రాసిన మీరు ముఖ్యమైన సంగతి మరిచారే?” అన్నారు యువమిత్రులు శ్రీ మరింగంటి రంగాచార్యులు “ఏమిటి?” అని ఉలిక్కి పడ్డాను “చెప్పులకు ఎటువంటి మంచిఏర్పాటు చేశారు? అది వ్రాయవలసింది” అన్నాడు ఆయన నిజం చిత్తం శివుని మీద, భక్త చెప్పుల మీద అన్న సామెతను వమ్ము చేశారు బిర్లా మందిరం నిర్వాహకులు “నిజమే, పొరపాటే, వ్రాయక పోవడం” అని ఒప్పేసుకున్నాను యువకులవద్ద తప్పు ఒప్పుకోడం వారి దృష్టిలో పెరగడానికి పెద్ద టెక్నిక్ సుమండీ!

— తిరుమల రామచంద్ర

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డిటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777



హెచ్చు తెల్లదనము. తక్కువ ఖర్చులో




సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరి క్రొత్తది! ఇది క్రొత్త పొడుములా దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడా! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడా!

ఒక క్రొత్త రకపు ఉతికే బార్‌ను వాడడము ప్రారంభించండి—సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్!

# ఉ త్త రా లు

(5 వ పేజీ తరువాయి)

వరక నీటి ప్రవాహం వచ్చింది స్వామీజీ బిక్కుబిక్కు మంటూ ఆశ్రమంలో హేవనాల కూర్చొన్నారు. యాదవస్త్రీ పాలకుండను నెత్తిన పెట్టుకుని యథాప్రకారం స్వామికి పాలు తెచ్చింది. సాధువుక ఏమీ అర్థంగాక, ఆశ్చర్యంతో నీవు ఎలా ఏరు దాటి వచ్చావు. ఈ రోజు ఏరు బాగా పొంగి నట్లున్నదే అని అడిగారు ఉడుకోకుండా! సమాధానమిచ్చిందావిడ మీరేగదా స్వామి, చెప్పారు. భక్తితో ఏరు దాటితే వరదలు అడ్డురావని, అందువల్ల నీటిమీదే నడచివచ్చినాను అని స్వామీజీ సంభ్ర మాశ్చర్యవంతలకు అంతులేదు.

కె. శివరాం (హైదరబాద్ 27)

## క థ లు

5–3–76 వ తేదీనాటి పత్రికలోని 'మాధురి' మధురంగాలేదు ఆ కథ అన్ని సినిమా డైలాగుల మిశ్రమం అని చెప్పవచ్చు ఆ కథ చదువుతున్నప్పుడు ఒక సినిమా చూస్తున్నట్లు ఫీల్ అవుతాము.

శ్రీనివాసమూర్తి (మండ్య)

* * *

ప్రతివారం వలెనే ఈ వారం కూడా (27 2.76) ఆంధ్రపత్రిక కొని ప్రతోఎలో చదువుతూ వస్తూంటే సన్ను రిక్షా డాష్ కొట్టి నాకు ముణుకు బెణికింది అంటే నేను పత్రికకు ఎంతలభిమానాన్ని ధారపోస్తున్నానో గ్రహింపండి

యు వి బాస్కర్, (విజయనగరము)

## సి ని మా

'శ్రీనివాస్' గారు సినిమా కబుర్లు భలేగా చెప్తున్నారు 'హిటాటో చిప్స్' నమిలినట్లుగా చదివేస్తున్నాం మేమే వెళ్ళి ఆ ప్రదేశాల్ని చూస్తున్నామా అన్నంత భ్రమ కలిగిస్తున్నాయి. హాట్స్ ప్ టు 'శ్రీనివాస్' మధ్యపేజీలో ఏదైనా ఒక 'తార' చిత్రాన్ని వేస్తే బాగుంటుందని నా సూచన.

ఎ. వెంకటాచారి, డి పద్మానందన్, మిస్ కమలాకర్

బహోర్‌పేట. (భువనగిరి)

## సామాన్యుని సణుగుడు

ఈ వారం 20–2–76 సంచికలోని సామాన్యుని సణుగుడు చాలా బాగుండటమే కాదు అక్షర లక్షలు చేస్తుంది అది ఎదిసార్లు చదవాలంటే నమ్మండి

సి వెంకటరమణఫణి, (అల్లగడ్డ)

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'సామాన్యుని సణుగుడు' శీర్షికన 'శ్రీ పిరాజీ' గారు చర్చిస్తున్న ప్రస్తుత సమస్యలు క్లుప్తంగానూ, చాలా ఆసక్తికరంగానూ వుంటున్నాయి.

మినీ ఇంటర్వ్యూ శీర్షిక ప్రయోజనమేమిటి? చెప్పండి. విజ్ఞానదాయకమా? వినోదదాయకమా? గుంటూరులో ఎవరో బి కాం. చదువుతుంటే ఎవడిక్కావాలి? ఎవరికో హేమమాలిని అభిమాన నటి అయితే ఎవడిక్కావాలి?

వేదగిరి లక్ష్మీనరసింహారావు, (నెల్లూరు)

# పు స్త కా లు

## తెలుగు కార్టూనిస్టుల ప్రత్యేక సంచిక

తొలిసారిగా తెలుగు కార్టూనిస్టుల సమావేశం జనవరి 11 న ఖమ్మంలో జరిగింది. ఎక్కడెక్కడో ఏవేవో పనుల్లో ఉన్న మన కార్టూనిస్టులంతా రెక్కలు కట్టుకుని ఆ సమావేశానికి ఖమ్మంలో వాలారు. ఆ సందర్భంగా వాళ్ళ ప్రత్యేక సంచికనొకదాన్ని వెలువరించారు.

మొట్టమొదటిసారిగా తెలుగు కార్టూనిస్టులు ఒకచోట సమావేశం అవుతున్నారు కాబట్టి దానికో విశిష్టత ఉంది. ప్రముఖులు సందేశాలు పంపారు. ఆ సందేశాలని, ఆరుద్ర కూనలమ్మ పదాలని, కార్టూనిస్టులు, ప్రముఖ రచయితలు కార్టూన్ చిత్రాల గురించి వ్రాసిన వ్యాసాలని వెయ్యడం జరిగింది. కార్టూనిస్టుల చిరునామాలు, పరిచయాలు, సలవై మొగ్గురి |కీ.శే. తలిసెట్టిది కాక| ఛాయా చిత్రాలని కూడా యిందులో ముద్రించారు కార్టూనిస్టుల ప్రత్యేక సంచిక కాబట్టి నిండుగాయూటజరవై ఒక్క కార్టూన్ లని కడుపుబ్బ నవ్వించేలా వేశారు. శ్రీ జయదేవ్ వేసిన 'సాపసీర్ ట్యూబ్ లైట్స్' ఈ సంచిక హైలైట్స్‌లా ఉన్నాయి. లరిదమ్మైన ముఖచిత్రాన్ని శ్రీ బాపు వేశారు.

160 పేజీలు గల ఈ ప్రత్యేక సంచిక వెల 8 రూపాయిలు. ప్రతులకి టి. సి. సి. 76, 3–6–102/ఎ, బషీర్ బాగ్, హైదరాబాదుకి రాయాలి.

[ఎం ఆర్.]




Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

సుజాత రాకతో వాళ్ళిద్దరి నవ్వులూ ఆగిపోయాయి

"నేనూ కాఫీ త్రాగి వస్తాను ఉండండి, బావగారూ!" అని సుమ లేచి లోపలికి వెళ్లింది

"కూర్చో సుజాతా" — మామూలుగానే అన్నాడు

లోగడా అతడు చాలాసార్లు అన్నాడు ఏమిటో బెరుకు అనిపించి అలా చేయలేకపోయింది అపుడు మరి ఏమనుకొందో అతని నోటినుంచీ ఆ మాట వచ్చీరావటంతోనే సుమ ఖాళీచేసి వెళ్లిన కుర్చీలో కూర్చొంది సుజాత

"చదువుకున్నంతసేపూ చదువుకుంటాను మిగతా సమయాలలో ఎవళ్ళతో ఒకళ్ళతో మాట్లాడుతూ కాలక్షేపం చేయటం నాకు అలవాటు సుమ బాగానే మాట్లాడుతోంది కానీ — నీవే ఎందుకో సందేహిస్తున్నావు" అన్నాడు విశ్వం

"నాతోనూ మాట్లాడతారా?" — సుజాత ముఖంలో ఎన్నో కాంతులు, ఆమె ప్రశ్నలో ఎన్నో అనుమానాలు వ్యక్తమయ్యాయి

"ఏం? నువ్వూ అందరిలాంటి మనిషివి కావా?'

"ఏమో చిన్నప్పటినుంచీ చూస్తున్నాను న్ను చాలామంది మామూలు మనిషిగా భావించటం లేదనే నా ఒనుమానం — కాదు అనుభవం"

"కావచ్చు అయితే నువ్వు నీ అనుభవం ఒక్కదనిమీదే బేస్ అయి ఫీలవకూడదు"

'మీరు నోటితో అంటున్నారు నేను అనుభవించి చెబుతున్నాను ఎవరో బయటివాళ్ళు ఏమో అన్నారంటే నేనంత బాధపడేదాన్ని కాదేమో కానీ — మా ఇంట్లోనే, నావాళ్ళే — నువ్వు కురూపివి అని వేలెత్తి చూపిస్తుంటే"

"మీ ఇంట్లోనా? ఎవరు?"

"సుమ! నన్ను ఎప్పుడూ ఏదో ఒకటి అని అది సంతోషపడుతూంటుంది తర్వాత నాకు తిండ సహించక, నిద్ర పట్టక — వా బాధ నేను పడుతూంటాను ఇటువంటిదాన్ని ఎందుకు బ్రతికి ఉన్నానా అని అనుక్షణమూ ఆలోచిస్తుంటాను"

"పాపం! నీ చెల్లెలే నిన్నిలా అంటుందా?"

"పోనీయండి దాని విషయం నాతో మాట్లాడటానికి ఎలాంటి అభ్యంతరాలు మీకు లేవుగా?"

"అటువంటివి ఉంటే అసలు నేను మీ ఇంటికి వచ్చే అవసరమే ఉండేదికాదుగా? ఏదైన సుజాతా, మనుషులంతా ఒకే స్వభావం కలిగిఉంటారనే మనస్తత్వాన్ని నువ్వు ముందు మార్చుకోవాలి కొందరికి బాహ్య సౌందర్యం ముఖ్యమైతే మరి కొందరు ఆత్మసౌందర్యం కోసం వెతుకుతారు ఆ రెండవ కోవకు చెందినవాణ్ణి నేను"

అతడి మాటలు విన్నాక ఏదో తెలియని హాయిలో ఓలలాడింది సుజాత మనసు కొంచెంసేపు

"కాఫీ, టిఫన్‌లు చల్లారిపోతాయ్ తీసుకోండి" అంది సంతోషాతిరేకంగా

"అలాగే తీసుకుంటాను అయితే ఒక షరతు" అన్నాడు ఎశ్వం మామూలుగానే

"ఏమిటి?"

# కాలమిచ్చిన తీర్పు

(30వ పేజీ తరువాయి)

"రోజూకూడా నువ్వు వచ్చి ఇలాగే కూర్చొం నాతో మాట్లాడిపోతుండాలి ఇలా చేయటం నాకోసం కాదు నీకోసమే ఇప్పటివరకు నువ్వు 'నేను అందరి లాంటిదాన్ని కాను' అన్నట్లు ఫీలై నీకు నువ్వు వేరే ప్రపంచం నిర్మించుకొని దానిలో వంటరిగా బ్రతుకుతున్నావ్ ఇకనుంచి మాత్రం అలా జరగటానికి వీలు లేదు సుమతో ఎలా మాట్లాడుతున్నానో నీతోనూ అలాగే మాట్లాడతాను ఇందువల్ల 'నాకూ ఒక జీవితం వుంద'న్న భావన నీలో కలగటానికి అవకాశం ఏర్పడుతుంది నీవూ నలుగురిలా మనశ్శాంతిగా కాలం గడపగలుగుతావు"

అతడి మాటలు విని — ఆ వ్యక్తి మంచితనాన్ని ఎలా పొగడాలో తోచక ఒకటే తికమకపడింది సుజాత

"అలాగేనండీ అలాగే" అంది ఆ తన్మయత్వంలో

అదే సమయంలో మళ్లీ తిరిగివచ్చింది సుమ

"ఇంకా యిక్కడే కూర్చున్నావేం అక్కయ్యా? అవతల అమ్మ పిలవటంలేదూ?" అంది

"వస్తున్నాను ఇంకా ఆయన కాఫీ త్రాగ లేదు" అంటూ చెల్లెల్ని చూడటంతోనే లేచి నిలబడింది సుజాత

ముఖ్యంగా సుజాతను యిబ్బందిపెట్టడం యిష్టంలేకే త్వర త్వరగా కాఫీ ఫలహారాలు కానిచ్చేశాడు విశ్వం ఖాళీ అయినది తీసుకొని ఆమె వెళ్ళిపోయింది

సుమ వచ్చి మళ్లీ విశ్వానికి ఎదురుగా కూర్చుంది

"పాపం, అక్కయ్యకు దేవుడు అన్యాయమే చేశాడు నేనుకానీ, మా అమ్మనాన్న కానీ—అందరం దాన్ని గురించే దిగులుపడుతూంటాం" అంది

"ఏం? ఏమయింది మీ అక్కయ్యకు? బాగానేవుందిగా?" అన్నాడు విశ్వం పైకి - లోలోపల మాత్రం ఆమె ఆంతర్యం తెలుసు

ఇక ఎలా విడమరచి చెప్పాలో బోధపడక ఊరుకొంది సుమ

"అమ్మ నన్ను పిలవటంలేదటగా? ఎందుకే అలా చెప్పావ్?" వచ్చి అడిగింది సుజాత చెల్లెల్ని దేన్ని గురించైనా అలా గట్టిగా అడగటం ఆమెకదే మొదటిసారి

సిగ్గుగా తల వంచుకొంది సుమ

గట్టిగా నిట్టూర్చాడు విశ్వం

తర్వాత ఏమనుకొందో సుజాత, "నాకు లోపల పని వుంది నేను వెళ్తున్నాను మీరిద్దరూ మాట్లాడుకొంటూండండి" అని చెప్పి గిరుక్కున వెనక్కుతిరిగి వెళ్లిపోయింది

విశ్వంతోపాటు సుమ కూడా ఆమె వెళ్లిన దిక్కే కొన్ని క్షణాలు చూస్తుండిపోయింది చివరకు,

"నా దృష్టిలో మనిషిని మనిషిగా చూడలేని వాళ్లకు హృదయం వుండదు నీ ఉద్దేశ్యం ఏమిటి సుమా?" అనడిగాడు చాలా కరకుగా వున్నాయి అతని మాటలు

దోషిలా విశ్వం ముఖంలోకి చూసింది సుమ ఆమె బేలతనానికి మళ్లీ విశ్వమే జాలిపడ్డాడు

"రూపం ఎలావున్నా ప్రతి మనిషికీ ఒక మనసువుండి తీరుతుంది, సుమా! మనసు ఎక్కడ వుంటుందో అక్కడ ఆశలు, ఆకాంక్షలు తప్పవు ఉదాహరణకు చెబుతాను — ఇపుడు నువ్వు అందంగానే వున్నావు భవిష్యత్తులో విధివశాత్తు నీ రూపురేఖలు మారిపోవచ్చు ఏదో ప్రమాదవశాత్తు చూసేవాళ్లకు నీది ఎంతో వికృతరూపంగా తోచవచ్చు అప్పుడు నిన్ను చూసి నలుగురూ చులకనగా మాట్లాడితే — నీ మనసెంత రంపపుకోతకు గురవుతుంది? భగవంతుడి దయవల్ల నీకలాంటి అన్యాయం ఏనాటికీ జరగకూడదు — అయితే కేవలం నువ్వు ఆలోచించుకోవటానికి చెబుతున్నాను"

[ఇంకా ఉంది]



